# స్వాతంత్ర్య స్వర్ణ భారతి

## యువ కవితాహారతి



సంపాదక వర్గం:

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

డా॥జి.కుమారస్వామి నాయుడు

కె.బి. లక్ష్మి

డా॥ ఎస్.నారాయణరెడ్డి

ఆచార్య ఫణీంద్ర



# స్వాతంత్ర్య స్వర్ణ భారతి

## యువ కవితాహారతి




సంపాదక వర్గం:

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

డా॥జి.కుమారస్వామి నాయుడు

కె.బి. లక్ష్మి

డా॥ ఎస్.నారాయణరెడ్డి

ఆచార్య ఫణీంద్ర




యువభారతి

తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001

SWĀTANTRYA SWARNA BHĀRATHI
Yuva Kavitha Hārathi
(An Anthology of poems written by fifty poets)



Yuva Bharathi Publications No. 162

First Edition : Sept. 1997



Copies : 1000

Cover design : Seela Veerraju

**Price : Rs. 20/**

Copies can be had from
**Yuva Bhārathi**
(A literary & Cultural Organisation)
Andhra Saraswatha Parishath Buildings
Tilak Road, Hyderabad - 500 001

Composed at :
**Fontline Graphics,**
Hyderabad. Ph: 7660000

Printed at :
**Sri Balaji Art Printers**
Chikkadapalli, Hyderabad.

Printed and published with the
financial assistence by
Youth Services Dept.
Govt.of Andhra Pradesh.

# అభినందనం

కె.వి. రమణ, ఐ.ఏ.ఎస్.
ప్రత్యేక కమీషనర్
యువజనసేవల శాఖ, ఆం.ప్ర. ప్రభుత్వం

ఋతువుల్లో వసంతంలాగా యౌవనం మానవజీవితంలో ప్రధానమైన దశా విశేషం. ఈ దశలో మానవజీవితం ఒక మలుపు తిరుగుతుంది. ఈ స్థితిలో వెలుగువైపు తమ ప్రయాణాన్ని కొనసాగిస్తే యువతీ యువకులు మహోజ్జ్వలమైన విజయాలు సాధిస్తూ ఉన్నత స్థితికి చేరుకుంటారు. చీకటివైపు తమ చూపులు ప్రసరింపజేస్తే వాళ్ళు కన్నీళ్లకు గురిఅవుతారు. అందుకే యువతీయువకులు జాగ్రత్తగా ఆలోచించి ముందుకు అడుగు వేయవలసిన అవసరం ఉంది. మన దేశ స్వాతంత్ర్య సమరంలో ఆనాడు పాల్గొన్న యువతీ యువకులే అనంతరం చక్కని నాయకులై దేశ ప్రగతికి వెలుగుబాటలు వేయగలిగారు.

యువతీ యువకులలో దాగి వున్న ప్రతిభకు గతి కల్పించి, యువశక్తినీ, చైతన్యాన్నీ అభ్యుదయం కోసం వినియోగిస్తూ వారికి స్వయం ఉపాధిని కల్పిస్తూ రాష్ట్ర ప్రగతిని సాధించాలనే సదాశయంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యువజన సేవాశాఖలో యువశక్తి పథకాన్ని ప్రవేశపెట్టి కార్యక్రమాలు నిర్వహిస్తున్నది. యువతరంలో ఒక నూతన స్ఫూర్తిని కలిగించడానికి ప్రయత్నిస్తున్నది. ఇటీవల యువజన సేవాశాఖ రాష్ట్రస్థాయి చిత్రలేఖన శిబిరాన్ని ఏర్పాటుచేసింది. అందులో 70 మంది యువ చిత్ర కళాకారులు ఎంతో ఉత్సాహంతో పాల్గొని తమ చిత్రాలను ప్రదర్శించారు. అలాగే స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలు జరుపుకుంటున్న ఈ సందర్భంలో కవితారంగంలో కృషి చేస్తున్న 50 మంది యువకవులనూ, కవయిత్రులనూ ప్రోత్సహిస్తూ సన్మానించాలనే ఉద్దేశంతో ఒక యువకవి సమ్మేళనం ఏర్పాటు చేసి, ఒక కవితా సంపుటిని ప్రచురించాలని సంకల్పించింది - యువజన సేవాశాఖ. ఈ కార్యక్రమ నిర్వహణ బాధ్యతను ప్రసిద్ధ సాహిత్య సాంస్కృతిక సంస్థ 'యువభారతి' స్వీకరించింది. ఫలితంగా ఈ కవితా సంపుటి. ఇలా అవతరించింది.

మా సంకల్పానికి కార్యరూపమిచ్చి, ఈకవితా సంపుటిని ఇలా ఆకర్షణీయంగా ప్రచురించి యువకవితా చైతన్య స్ఫూర్తికీ, ప్రసారానికీ సహకరించిన యువభారతి సంస్థకు కృతజ్ఞతలు.

తేది : 5, సెప్టెంబరు, 1997

**కె.వి. రమణ**

# నాలుగు మాటలు...

మంచి కోసం ఉద్యమిస్తూ, సమకాలిక యువతరంలో నిర్మాణాత్మక దృక్కోణం ఏర్పడడానికి అనువైన వాతావరణం కల్పించాలన్నది యువభారతి ఆకాంక్ష. ప్రతి మనిషిలో నిక్షిప్తంగా ఉన్న ప్రతిభకు గతి కల్పిస్తే, సమాజం ప్రగతి ముఖంగా నడుస్తుందని యువభారతి విశ్వాసం. ఈ దృష్టితోనే యువభారతి అనేక కార్యక్రమాలను నిర్వహిస్తున్నది - ముప్పై రెండు సంవత్సరాలుగా.

యువతీ, యువకుల్లో ఉన్న ప్రతిభను ప్రోత్సహించి, వారి శక్తినీ, చైతన్యాన్నీ అభ్యుదయోన్ముఖంగా ప్రసరింపజేయాలన్న ఆశయంతో పనిచేస్తున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ యువజన సేవాశాఖవారు ఈ స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంగా ఒక యువకవి సమ్మేళనం నిర్వహణను, యాభైమంది యువకవుల కవితా సంపుటి ప్రచురణ బాధ్యతను యువభారతికి అప్పగించి ఆర్థికంగా సహకరించారు. ఈ కవితా సంపుటిని మా సంస్థ పక్షాన వెలువరింప జేసిన యువజన సేవాశాఖ ప్రత్యేక కమీషనర్, సహృదయులు శ్రీ కె.వి. రమణగారికి మా కృతజ్ఞతాభివందనాలు.

పత్రికా ప్రకటనకు స్పందించిన కవులు తమ కవితలను పంపించారు. ఆంధ్రప్రదేశ్ నలుమూలలనుండి సుమారు వందపై చిలుకు కవితలు వచ్చాయి. వీటిలో మేము ప్రకటించిన మేరకు యాభై కవితలనుఎన్నుకోవడం జరిగింది.

ఈ సంపుటిలోని కవితలన్నీ ఈనాటి మన దేశ పరిస్థితికి అద్దం పడుతున్నాయి. గతానికి, వర్తమానానికి ఉన్న భేదాన్ని చూపించి సముజ్వల భవిష్యత్తును దర్శించి, మార్గాన్ని సూచిస్తున్నాయి. తమ భావాలను స్వేచ్ఛగా వచన కవితగా, గేయంగా, పద్యంగా ప్రకటించారు యువతీ యువకులు.

యువభారతి పత్రికా ప్రకటనను గమనించి, స్పందించి, కవితలను పంపి, కవి సమ్మేళనంలో పాల్గొని ఈ సంపుటి ఇలారూపుదిద్దుకోవడానికి హార్దికంగా సహకరించిన కవులకు, కవయిత్రులకు మా అభినందనలు. అభివందనాలు. ఈ సంపుటికి అందంగా ముఖచిత్రాన్ని అందించిన కళామూర్తి శ్రీ శీలా వీర్రాజుగారికి, ముద్రించిన శ్రీ బాలాజి ఆర్ట్స ప్రింటర్స్ వారికి మా కృతజ్ఞతలు.

**తిరుమల శ్రీనివాసాచార్య**

అధ్యక్షులు, యువభారతి.

# ఇందులో...

# నీ స్వేచ్ఛకు యాభై ఏళ్ళు

— కంఠ బంగారు రాజు, ఏలూరు

మేరా హిందుస్థానీ ! నీ స్వేచ్ఛకు యాభై ఏళ్ళు!
గురూజీ, నెహ్రూజీ కలల్లో
నేతాజీ, బాపూజీ కార్యదీక్షలో పుట్టింది నీ స్వేచ్ఛ.
బహుశః నీ పైవారికి దాస్యం చేస్తూ మరిచినట్టున్నావ్
నీ స్వేచ్ఛకు యాభై ఏళ్ళు!
నీతాతల త్యాగాల వెల్లువలో
లాఠీల మోతల్లో పుట్టింది నీ స్వేచ్ఛ
బహుశః మందుపాతర మత్తుపొగల్లో నిదురిస్తున్నట్టున్నావ్
ఇపుడు నీ స్వేచ్ఛకు యాభై ఏళ్ళు.
రవి అస్తమించని రాజ్యంలో చీకటిరేఖ దూసుకుపోగా
వెలిగిందికదయ్యా నీ స్వేచ్ఛ,
బహుశః స్కాముల ఊబిల్లో చిక్కిన హవాలా
దివాలా విధానాన్ని తిలకిస్తునట్టున్నావ్
నీ స్వేచ్ఛకు ఇపుడు యాభై ఏళ్ళు.
ఉప్పు కళ్ళు నిప్పుగుళ్ళై పేలగ
స్వేచ్ఛావాయువు పీల్చావు కదయ్యా
బహుశః అధికారం ముష్టేసి న్యాయాన్ని
నడిబజారులో అడుక్కుంటున్నట్టున్నావ్
నీ అమాయకత్వానికి యాభై ఏళ్ళు.
వాడవాడలు ఉప్పెనలా కదలగా
ఉద్దండుల ఉద్యమాల ఉద్ధృతిలో ఉదయించింది నీ స్వేచ్ఛ
చెరసాలలు, ఉరికొయ్యల చెంత నీ చరిత్ర మ్రగ్గిపోగా
శ్వేతజాతి బుగ్గిలోన రాజుకుంది నీ స్వేచ్ఛ,
బహుశః నైతిక విలువకు నిప్పెట్టి నునువెచ్చగా
చలికాగుతున్నట్టున్నావ్
నీ స్వేచ్ఛకు యాభై ఏళ్ళు. నీ స్వేచ్ఛకు యాభై ఏళ్ళు
నీ స్వేచ్ఛకు యాభై ఏళ్ళు అని పదే పదే ఎందుకు అరుస్తున్నాననుకుంటున్నావ్?
వందేళ్ళకైనా మేలుకుంటావని, నీ ముందుతరాన్ని వెలిగిస్తావని ★



# మత్తువీడి కాపాడుకో మాతృభూమి

– పల్లెర్ల రాంమోహన్‌రావు, మహబూబ్‌నగర్

ఎందరి దేశభక్తి మరియెందరి దాస్యవిముక్తిరక్తియున్,
ఎందరి శౌర్యధైర్యములు, నెందరి ఉద్యమ శక్తియుక్తులున్,
ఎందరి దానశీలతయు, నెందరి పుణ్య విశేష సంపదల్,
సుందర భారతాంబను నిజోజ్జ్వల దీప్తుల వెల్లజేసెడిన్

మన పూర్వుల ఆవేదన
మన సందున మరచి, మనము మసలుచు భువిపై
కనికరము లేక పాపపు
పనులకు బూనితిమి దేశభక్తియె దొలగన్

స్కాముల్, స్కీములు మింగివేయుటయు, ఆశాభూత చేతస్కులై
స్వాముల్ కొందరు దొంగవేషములతో 'స్వాహాయ' మంత్రంబునే
నేమంబొప్ప జపించుటల్ కుమతులై 'నేష్నాలిటీ' యంచు నే
వో మాటల్, పరికింప మానవత ఏ పొల్మేరలన్ దాటెనో!

మత భేదంబొకటేని గల్గునెడలన్ మన్నింపవచ్చున్ ఇలన్
అతియై, ప్రాంతము, వర్గ, భాష, కుల వైషమ్యంబులుప్పొంగి, దు
ర్గతులన్ గూర్చగ, మార్చువాడెవడుపో, గాఢాంధకారంబు లీ
గతి వెన్వెంటను మూగె జాతికిని నీ గండంబు లెట్లోనా కో?

హత్యాకాండకు పూనితో? జనులు హాహాయంచు ఘోషింపగా
నిత్యంబయ్యెను కత్తి, బాంబులకటా నిర్మూలనోపాయముల్
అత్యావేశమె భూషణంబయ్యె తుదిన్ ఆలోచనాహీనమై
సత్యాన్వేషణ శూన్యమయ్యె జగతిన్ సంహార కృత్యంబులన్

ప్రలయోగ్నులెగజిమ్మి విలయాల సృష్టించు
    ధీశక్తి యెవని ఆధీనమయ్యె
స్వాతంత్ర్య సమరాగ్ని సమిధలై దూకంగ
    దేశభక్తవని కావేశమిచ్చె
తుంటరియైన "పూవింటి నిపుణునికి"
    బంటై యెవడతని వెంటదిరుగు
నవ్యమౌ జగతికి, దివ్య మార్గము జూపు
    మేధయెవ్వనియందు మెదలుచుండు

ఎవడు స్థితి సృష్టిలయల చేవగల్గి
మూడు మూర్తుల అంశను బూనినాడు,
అతడె యువకుడు - దేశ ప్రగతికి నేడు
శక్తి యుక్తులు తోడుగా సాగవలయు

గుట్కా, మట్కా, హెరాయిను చిట్కాలన్ని
పాడుజేయును నీ తోడ ప్రగతినెంతొ
యువత దౌర్బల్యమైయున్న భవితసున్న
మత్తువీడి కాపాడుకో మాతృభూమి

బద్ధకమ్మును వీడి, నీదగు బాధ్యతల్ మదినెంచుచున్,
బుద్ధిగా విధులాచరింపుము పుణ్యకార్యమనస్వివై
ఉద్ధతన్ తనయున్కి చాటెడు ఉగ్రవాదమడంచుచున్,
ఉద్ధరింపుము మాతృభూమిని ఉర్వియందున మేటిగా



# శుభ సందేశం

- వి.ఎల్. పద్మాసుందరి, సికిందరాబాదు

అంగట్లో అన్నీ ఉన్నాయి - అసలు శనే ఎక్కడుందో తెలియడంలేదు
శ్రమశక్తి, సైనిక స్ఫూర్తి, మానవయుక్తులు సమృద్ధిగానే ఉన్నాయి
పరాయి వాడికి పగ్గాలిస్తే, కళ్ళకు గంతలు
కట్టి తప్పుడు త్రోవల నడిపిస్తున్నాడనే వెఱ్ఱిభ్రమలతో
పాపం మన పెద్దలు
పోరి, ప్రాణాలొడ్డి తెచ్చారు స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు
కలసి మెలసి ఎదగమని
ప్రపంచపు అతి పెద్ద రాజ్యాంగంతో ఇచ్చారు లౌకిక, ప్రజాస్వామ్యాలు
మన హక్కులు, బాధ్యతలు మనకు బాగా తెలుసు
అయినా అవసరమైనప్పుడు ఎప్పుడూహక్కులే గుర్తొస్తాయి
తప్పు మనది కూడా కాదేమో !
కంప్యూటర్ల కనుగుణంగా కాలం మారుతున్నా
నేర్చిన విద్య బ్రతుకు నిచ్చే ఉద్యోగాలను చూపకుంటే
ఆకలి, దారిద్ర్యం, ఆలోచనను, వివేకాన్నీ చంపేస్తుంటే
అర్థంలేని ఆవేశం ఆశయాలకు అధోగతిని పట్టిస్తుంటే
మరిగే ఉడుకు నెత్తుటిని సైతం మత్తు పదార్థాలు పీల్చేస్తుంటే
నవీన భారత రణరంగంలో
తనతో తనవారితో తానుగా పోరాడే శక్తిలేక
అస్త్రసన్యాసం చేస్తున్న అర్జునులకు
బ్రతుకు భగవద్గీతను బోధించగల భగవానులు లేకేనా?
ఓనమాల కన్నాముందే "ఓ.సి." వా? "బి.సి."వా? అని కులమత వాదాలు తలెత్తితే
ఆర్యులు, ద్రావిడులంటూ ప్రాంతీయ భాషాభేదాలు వెంటాడితే
రాజకీయ స్వలాభాలు, గూండా మాఫియాలు సామాన్యుని శాసిస్తే
అవినీతి, రెడ్ టేపిజాలు అడుగడుగునా, ఆటంకాలైతే
ఎదుర్కొని ముందుకు సాగే ఓపికలేక
ఎలాగో అలా గడిచిపోతే చాలనే నిస్తేజానికి నాంది పలుకుతూ

పోరాడక ముందే ఓటమికి తలవంచే నేటి యువతను ఉత్తేజపరచేందుకు
తరతరాల బానిసబ్రతుకు నుండి విముక్తి నిచ్చిన వీరనాయకులే రావాలా?
ఊహూ! అక్కరలేదు. మనమేం చేయాలో మనకు బాగా తెలుసు
కలసికట్టుగా కృషిచేస్తే మరో మహాప్రస్థానం దూరమేమీకాదు
కొంచెం స్వార్థం, స్వలాభం విడిచివేస్తే
కాస్త నిరాశా, నిస్పృహలను పక్కకు నెట్టివేస్తే
ప్రతి ఒక్కరూ స్వశక్తిని, సమష్టిశక్తిగా మార్చివేస్తే
కాగితాలలోని ప్రణాళికలకు ప్రాణం పోసి కార్యరూపమిస్తే
ఇరవయ్యొకటవ శతాబ్దం నాటికి సంపూర్ణ ప్రగతి
సాధించడం ఈనాటి యువకులకు కాదేమో కష్టతరం
ఇదే భరతమాత నవతరానికి, యువతరానికి
ఇస్తున్న స్వాతంత్ర్య స్వర్ణోత్సవ జాతీయ శుభ సందేశం



# ఎదురించు సవాళ్ళు !

- గన్ఫోజు శ్రీనివాసాచారి, పెద్దపల్లి.

మనం ముందుకు, ముందుకు,
ఇంకా ముందుకు వెళుతున్నామా!
లేదు! మా'నవ' సంబంధాలు తెగి,
దూరమై భారమై పోతున్నాయ్!
కులాల కంపువాసనలింకా
రాజకీచ(య) నాయకుల చందరంగంలో
పావులై మధ్యస్థంగా నేటికి,
త్రిశంకుస్వర్గంలో ఊగిసలాడుతున్నాయ్!
మతాలమా'రణ' హోమం,
రావణకాష్టంలా రగులుతూనే ఉంది!
మనిషికి మనిషికి మధ్యన
అ'గాథా'లు పెరిగిపోతూనే ఉన్నాయ్!
మొన్న, నిన్న 'భాయి' 'భాయి' అన్న చేతులు
నేడు చేయి చేయి అంటూ 'చేయి'స్తున్నాయ్ !
అవినీతికి, స్వాముల స్కాముల
దాణాలు, నిత్యార్చన పూజితాలు అవుతున్నాయ్!
అన్యాయపు నీలి నీడలకు,
నేడు నిత్యాభిషేక నీరాజన జపాలు సాగుతున్నాయ్!
న్యాయమంటే చాలిక,
నోరు నొక్కి మూసేసుకోమంటున్నారు!
అవినీతి అంటే చాలు,
పిచ్చివానిలా చూసి అధః పాతాళానికి తోస్తున్నారు!
నిజం చెబితే ఏముంది!
నిప్పులాంటి మాటల తూటాలతో కాలుస్తున్నారు!
మనసు చంపుకొని బ్రతుకుటెన్నాళ్ళు?
మగత వదల్చుకొని, ఎదురించు సవాళ్ళు!



# భరత సుతునకింక తిరుగన్నదే లేదు

– ఆచార్య ఫణీంద్ర, సికింద్రాబాదు.

బానిస తనమనెడు బందిఖానను కూల్చి,
వెలుగు రేఖలందు జలకమాడి,
స్వపరిపాలనమ్ము సాధించుకొనినాడు
భారతీయుడైదు పదుల నాడు

దిగుమతి చేసినాడట విదేశములందున నుండి ధాన్యమున్
దిగబడి అప్పులందు, క్షుధ తీర్చగనప్పుడు – అట్టిదిప్పుడో!
ఎగబడి హెచ్చుచున్న జనమెల్లర కాకలి తీర్చి, పైన తా
నెగుమతి కూడా చేయు;నతడెంతటి వృద్ధిని పొందినాడహా!

' సూపరు కంప్యూటర్ల'ను
'జపానీ', 'అమెరికన్ల' సాటియె తానై
వ్యాపారము చేయగలడు
'ప్రాపంచిక విపణి' నెంత ప్రగతిని పొందెన్!

అంతరిక్షమందు నద్భుతాలను చేసె
'అగ్ని', 'పృథ్వి' క్షిపణు లహమునీవె?
శాస్త్ర వృద్ధి, అతని సాంకేత విస్తృతి
పరులు చూచి గుండె బాదుకొనిరి

ఈ రీతి కనిపించెడీతడే వేరుగా
కనిపించు చూడగా, కన్ను మార్చి
స్వార్థమ్ము చిక్కని ఛాయగా రూపొంది
అతని గుండియలోన అలముకొనెను
ధన దాహమధికమై, దావానలమ్మునై,
కరుణ, జాలి, దయల కాల్చివేసె
రాజకీయములందు రాక్షసత్వము హెచ్చి
నైతిక మూల్యాల నష్టమయ్యె

పేదవారి పైన ప్రేమనే చూపించు
వారలెవరు కానరారు నేడు
ధనము కన్న వేరు దారులే కరువాయె
నీతి శాస్త్రములకు పాతరాయె

'స్కాము'లు, ప్రజలను దోచెడు
'స్కీము'లు, చెడు రాజకీయ 'గేము'లు, 'బాబా
స్వాములు, నిలువెల్ల విషపు
పాములు పీడించె నేడు భారత భూమిన్

భారతీయుడమిత భవ్య చరిత్రుడు
కృష్ణుడై పలికెను 'గీత' నతడు
బోధ చేసెనతడు బుద్ధుడై బౌద్ధమున్
కాళిదాసతండె ! గాంధి యతడె !

యువకులెరిగి దీని, యూరపు దేశాల
భావదాస్యమనెడు బ్రదుకు వీడి,
శాంతి, ప్రేమ, కృషియు, స్వార్థ రాహిత్యముల్
హృదిని నిలుపుకొనుచు నెదిగినపుడు

భరత సుతునికింక తిరుగన్నదే లేదు
వేల వత్సరాలు విశ్వమునకు
దారి చూపినట్టి ధార్మిక సంపద
వీని సొత్తు – ఎవడు వీని ఎత్తు ?



# కర్తవ్యం

– ఇరువింటి వేంకటేశ్వర శర్మ, పేరూరు, మహబూబ్‌నగర్

సకల కళలకు నిలయమైనది
సత్యా హింసల హృదయమైనది
సమరయోధులు జనన మందిన
భరత దేశము ధన్యమైంది
దివిజగంగను భువికి దించి
తుహిన పర్వత శోభ పెంచి
అంద చందము లరసి చూడగ
అమర పురినే పోలు నిదియే
గాంధి చేసిన ఉద్యమమ్ముల
పులకరించెను భరత జాతి
ఊరు ఊరుల వాడ వాడల
కదిలి వచ్చిరి క్రాంతి పథమున
గాంధి నెహ్రుల ధర్మ మార్గము
బుద్ధ యోగుల శాంతి మార్గము
ఆచరించటె దివ్య మార్గము
సకల జనులకు అవనిలో
పరుల కొరకే తరులు మొల్చును
పరుల కొరకే గిరులు నిల్చును
పరుల కొరకే పంచభూతము
లవతరించెను జగతిలో
మర మనుషులతో సరసమాడి ఓ నరుడా!
గగన సీమలో సమరం సాగింతువేల ?
ధర్మ మార్గము ననుసరించిన
ధరణిని మరుభూమిగ మార్చెదె వేల?
గ్రహాలకు ప్రతి సృష్టి చేసిన నరుడా!
ఇలా తలంపై రుధిరం కురిపించెద వేల?

జలధి తరంగములపై
మరణ మృదంగం వినిపించెదవేల?
కులం మతమని కుమ్ములాడకు
కలం బలిమితో కదలు ముందుకు
శాంతి గీతము లాలపించిన
కర్మ భూమిని మరువబోకు
సస్యశ్యామల దివ్య ధాత్రిని
స్వార్థ జ్వాలల ముంచి వేయకు
భావితరాల నవ్య యువతకు
శేష ప్రశ్నగా ఉదయించకు
తర తరాల రథ సారథివై
శ్రమ జీవన ప్రతినిధివై
శ్వేత కపోతం ఎగిరించు
ధర్మ చరితవై చరియించు



# అభ్యుదయ దీప కాంతులు

– కట్టమూరి రవి, పాలంగి

భరతమాతకు పచ్చని పట్టుపావడా
వ్యవసాయ శ్రామికులు నేసిన క్రొత్త వస్త్రం
పరిశ్రమల సిరుల తిలకం
మెరుస్తోంది అమ్మ వదనాన ఎర్రగా
అమ్మ కంచుకోటకు కాపలా
విశ్రమించని సైనికుల శ్రమ రాత్రీ పగలూ
విద్యా, వైద్య రంగాల ప్రగతి దీపాలు
అమ్మ కలశాన మెరుస్తున్నాయి ఎర్రని ముత్యాల్లా
సేవా వ్రతుల ఆనంద తరంగాలు
భరతమాతను కీర్తించే నిత్య నీరాజనాలు
దేశం పయనిస్తోంది
అభివృద్ధి కెరటాల ఉత్సాహంతో
ప్రగతి హిమాలయాల ఎత్తు ఎంతో చూడాలని,
స్వర్ణోత్సవ సంబరాల వేళ
ఆనందం తాకింది అంబరం అంచుల దాకా
పురోగతి పావురం ఎగురుతోంది ప్రపంచ వినీలాకాశం లోనికి

ఎగిరే పావురం ఒక్కసారి వెనక్కి తిరిగింది
అవినీతి, లంచాల, అక్రమాల
అయోమయం చూసి ఏడ్చింది గాబరాగా
వెన్ను పోట్లు, హత్యా రాజకీయాలు,
పశుగ్రాస కుంభకోణాల పరవళ్ళు
చూసి తిరిగాయి ఆ పావురం కళ్ళు
యువత మత్తు మగతలో
విరుస్తోంది బద్ధకంగా ఒళ్ళు

అంచనా వేయాలి మన శక్తి యుక్తుల్ని
చూద్దాం భవిష్యత్ భారత స్వరూప స్వభావాల్ని

తగ్గిందాం జనాభాను
అంతం చేద్దాం అవినీతిని
రాజకీయ చైతన్య దీపాలు
వెలిగిద్దాం మనం నిరంతరం
యువకుల చేతి వజ్రాయుధం
ప్రగతికి చుట్టాలి నిత్యం శ్రీకారం
నలుగురికీ విద్య
తొలగిస్తుంది మిధ్య
మహిళల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు
తిమిరాలను తరిమే అభ్యుదయ దీపకాంతులు



# ఏల మగత ?

– నరసింహ శర్మ, వనపర్తి.

యువకులారా !
ముక్కలయ్యే దేశాన్ని ఒక్కటిగా నిలుపుకొండి
ఉడుకులెత్తు గుండెలతో పిడికిలెత్తి కలిసిరండి
అమానుషపు మతరక్కసి కుత్తుక తెంచగ కత్తులు
పదును పెట్టి కదలిరండి
గుక్కెడు గంజికి నోచని దారిద్ర్యం తాండవించు
గుడిసెలలో నివసించే అమాయకపు అన్నార్తుల
బాధ తీర్చ తరలిరండి
వరకట్నపు మంటలలో కాలిపోయి నివురయ్యే
వెతల కతల నార్పరండి
నిరుద్యోగపు కోరలలో చిక్కిపోయి నలిగిపోయి
నీరస పడి చచ్చిపోవు యువతకు బ్రతుకివ్వ రండి
నేతిబీర కాయవంటి నేతలలో 'నీతి'ని
దులిపెయ్యగ యువకులార! తరలిరండి! ఉరికిరండి!
అటు దైన్యం, దారిద్ర్యం, నిస్తేజం, నైరాశ్యం,
ఇటు క్షామం, సంక్షోభం, దహనం, హత్యలు, కుట్రలు,
దోపిడీలు, తగాదాలు అలముకొన్న ఈ దేశపు
భవితవ్యం ప్రశ్నార్థక మవుతుంటే ఏల మగత?
ప్రగతి దిక్కు కనలేరా?
జనచేతనా శక్తుల వలె కదంత్రొక్కి సాగలేరా?
అస్తమించు భాస్కరుడే ఉదయించి ఉషస్సునింప
నవశక్తులు యువశక్తులు నిస్తేజం కాకూడదు
ఈ దేశపు గతిని మార్చ మీరంతా ఉరికిరండి



# స్వతంత్రం

– జీడిగుంట సాయిబాబా, హైదరాబాదు.

కవుల కలాలు శాంతిగీతాలు
ఆలపిస్తూనే ఉన్నాయి....
దేశం శ్యామల మంటూనే ఉన్నాయి.
అంతా క్షేమం కలాల్లో...కలల్లోనూ!
ఐదుపదులు దాటినా
దాస్య శృంఖలాలు తెగి;
ఏదిస్వేచ్ఛ? నిరుపేద జీవితంలో
క్షుధార్తి నేడ్చి కన్నీరు త్రాగే
కుక్షి తప్ప గండె జాడ లేదు!
భారత పౌరులనుకున్న సగర్వ ఆకాంక్ష
మట్టిలో కలిసిపోయె
నిశా బాల పోలి నృత్యాలు చేస్తుంటే
మానవ జీవితాలో.. తీవ్రవాదులై!
ధన దాహం, అధికార దర్పం
అవినీతి, ఆశ్రిత సేవ
కాలం కలిసొస్తే స్కాముల నోములు
క్షామం, కామం
క్షేమం నా దేశంలో
కులమతాలు, కుతంత్రాలు
కలిసి చేసే పాలనలో
ఏమని చెప్పను నేటి నా దేశం గూర్చి ?
పరాయి వారి సహకారంతో
"మేరా భారత్ మహాన్" "వందేమాతరం"
అంటూ నేతల నిస్సార ప్రసంగాలు,
మనసు చలించే మలిన రాజకీయాలు
ఏదీ స్వేచ్ఛ నిరుపేదకి? పూర్ణ మనస్సుకి?

చీకటి పాపంలా నా నుండే
స్వేచ్ఛ కోరే నా మనస్సు
గతాన్ని తలుస్తూ తలపోస్తోంది...
నల్లదొరల రాక్షసత్వం కాన్నా
తెల్లదొరల దోపిడి రాజ్యం మేలంది
కాశ్మీరు నుండి కన్యాకుమారి దాకా
ఒక్కటి చేసిందిట!
యువతా... మేలుకో!
చరిత్ర పునరావృతమో!
సువర్ణాక్షరాలో! తేల్చుకో...
ఆనందం పెంచుకో!!



# భంగపడ్డ భారతమ్మ

– కూర్మాచలం శంకరస్వామి, జగద్గిరిగుట్ట.

తెల్లదొరల అమానుషం అంతమైందను కుంటే
నల్లదొరలే నాగులై మింగుతుంటే
భల్లున తెల్లారేలోగా భగ్నజీవులు బలౌతుంటే
గుభిల్లున భారతమ్మ గుండె వెయ్యి ముక్కలయ్యె
మతతత్వం మంటల్లో మతరక్కసి మాడ్చుతుంటే
కుటిలత్వం కుంపట్లో కులతత్వం కూల్చుతుంటే
భాషా, ప్రాంతీయతత్వం దేశాన్ని కూల్చుతుంటే
భంగపడ్డ భారతమ్మ బోరున విలపిస్తుంది
అధికార, ధనదాహం అందలాన అధిష్టించి
అవారా, హవాలాలు దీవాలా తీయిస్తుంటే
కుంభకోణాలు దేశాన్ని కొల్లగొట్టి గుల్ల చేస్తుంటే
కృళ్ళి, కృళ్ళి భారతమ్మ కూలబడి పోయింది
ఘరానా దొంగలంత గద్దెనెక్కి కూర్చుండి
దళారుల దాపు చేరి ఖజానంత ఖాళీ చేసి
గంట గంటకు ధరల మంటలు పెంచేస్తుంటే
గండమైన బ్రతుకుల్లో గరీబోళ్ళ గుండె పగిలె
వరకట్నపు పిశాచాలు వధువుల మింగేస్తుంటే
కామాంధపు కాలనాగులు కన్యల కాటేస్తుంటే
అత్యాచారాలు, అమానుషాలు అతివల బలిగొంటుంటే
అల్లల్లాడి పోతుంది అమాయకపు భారతమ్మ
లీకేజి విద్యల్లో ప్యాకేజి ముడుపుల్లో
నకిలీ పట్టాల స్కాంలు నింగినంటి నాట్యమాడి
నమ్ముకున్న విద్యార్థులను నట్టేట ముంచుతుంటే
చావు బ్రతుకుల మధ్య చదువులమ్మ సొమ్మసిల్లె
గాంధీజీ ఆశయాలు గంగలో కలిపేసి,
గౌతముని బోధనలు గోదాట్లో కలిపేసి

శాంతాదూత సందేశం సంతలో అమ్మేసి
అంబేద్కర్ ఆచరణలు అంతటా తుంచేసి
రంగు రంగుల రాజకీయ రక్తపాతం సృష్టిస్తే
మంటకలిసే మానవత్వం రాజ్యమేలే రాక్షసత్వం
యేబది సంవత్సరాల స్వాతంత్ర్యపు పాలనలో
యేడ్చి యేడ్చి భారతమ్మ నీరసించి పోయింది
తొంబై సంవత్సరాలు అహర్నిశలు పోరు సలిపి
బందీయైన భారత బానిస సంకెళ్ళు త్రెంచి
మహామహులందించిన స్వాతంత్ర్యం ఇందుకా ?
అమరవీరుల త్యాగాలకు జోహార్లు ఇవేనా!
కాదు, కాకూడదు, కానీవ్వొద్దు
ఓ నేటి యువతీ, యువకుల్లారా!
భవిష్యత్ భారత నేతల్లారా!
సంబరపడకండి స్వాతంత్ర్యం వచ్చిందని
అంబరాన్నంటుతున్న అశాంతులన్ బోకండి
ఈ శాడిస్టు సమాజానికి సమాధులు కట్టేసి
సమసమాజ స్థాపనకు పునాదులు వేయంగ
ఈ కలం పట్టి నే ముందుంట
కదం త్రొక్కి రండి నా వెంట
మన హక్కులు, మన స్వేచ్ఛ
మన దేశాన్ని రక్షించుకుందాం



# ప్రగతి సూర్యుళ్లను నిలపాలి

– డి.ఆర్.సి.శివప్రసాద్. రాసునం, రంగారెడ్డి జిల్లా

భారత జాతికి మేలుకొలుపులు ప్రారంభమై
బానిసత్వం నుండి బాధ్యతల వైపుకు మరలి
స్వాతంత్ర్యపు గొడుగు చేబూని, ప్రపంచ విహారిమై
నేటికి ఏబది సంవత్సరములు కాలాధీనమయ్యాయి.
గాంధీ మహాత్ముడి అడుగు జాడలు మరచి
స్వాతంత్ర్య సమరయోధుల ఆశయములు నీరుగార్చి
ఎక్కడికక్కడే విఘటనకు లోనై ప్రస్థానిస్తూ
స్వావలంబన కొరకై పరితపిస్తున్నదీ దేశం
పసితనపు అలజడిలో, సభ్య దేశముల మధ్య
ఉజ్వలోపేతమైన సామర్థ్యం సాధించేందుకై
ధ్యేయనిష్ఠతో వీరోచితముగా ప్రస్థానిస్తూ
గతి తప్పిన నేతృత్వం వలయాలలో చిక్కి
మతి తప్పిన స్వార్థ విశేషముల మధ్య పోరాడుతూ
విఘటన ఫలమై భాషావేదికలను అధిరోహించినదీ దేశం
భారత దేశపు అంతరాత్మ
సామాజిక, రాజకీయ వ్యూహరచనలో
భిన్నత్వోద్దీపనమౌతూ, ఐక్యత లేక
విరాట్ స్వరూపము దాల్చినదీ దేశం
అమరవీరుల త్యాగఫలమౌ రీతి వెలుగొందుతూ
వివేకానందుడు కాంక్షించిన యువజనులారా!
విశ్రమించని రణ సూర్యులై ఉద్యమించి
తరతరముల తపః ఫలమౌరీతి వైభవ భారతావనిని నిర్మించి
దశదిశలలో భారత పతాకమును ఎగురవేసి
ప్రపంచ వేదికపై భారత ప్రగతి సూర్యుళ్ళను నిలపాలి



# ఏవీ ఆ వెన్నెల వెలుగు కిరణాలు?

– ఎం.వి.ఎం.భారతి, నెల్లూరు.

బంగరు తల్లి భారతమాత
మదినిండా ఆనంద సందోహం
మునిమాపు వేళ భారతమాత
చేసింది స్వర్ణోత్సవ స్వాతంత్ర్య శుభవేళ
కూచిపూడి నృత్యం కులాసాగా
కాలి మువ్వ జారిపడింది
తెల్లని హిమనగశోభను సంతరించుకొని
ఆ బంగరు మువ్వకై ఆరాటం,
అవినీతి జనాల అంతులేని పోరాటం
పసిడి పొలాల పచ్చని క్రాంతి
పేదరికం పోయిందేమోనను భ్రాంతి
మగత మనసుతో యువత
నిరాశా, నిస్పృహల సర్పం పడగల చాటున
నిరుద్యోగ, నక్సలిజాల మోడ్రన్ కురుక్షేత్రాన
పదిమందికీ ప్రగతి దీపకాంతులు
కావాలని ఎర్రకోట సందేశం
అవినీతి వినీలాకాశాన ఎగురుతోంది స్వార్థపు పావురం



# యువకుని బాట

– రంగినేని మనోమోహన్, మహబూబ్‌నగర్.

భారత దేశపు భవిత కోసమై
పోరు నడప నీవు లేచి నిలవరా!
బలహీనుడిగ బ్రతుకుతుంటే
భారతి నిన్ను మెచ్చబోదురా!
ఉక్కు పిడికిలి నీవు బిగించి
భారతమాతకు వన్నె తెమ్మురా!
మాతృదాస్య విముక్తి కోసమై
మంటల దూకిన వీర భూమిరా!
మానవత్వమును జగతికి చాటగ
మంచిని పంచిన త్యాగభూమిరా!
సింగము వోలె ముందకు దూకి
సిరుల భారతిని నీవు నిలపరా!
తీవ్రవాదులు నరహంతకులు
తల్లి భారతిని తూట్లు చేయగ,
రాజకీయపు రంకుల తోటి
రమ్య భారతం రగిలి రేగగా,
సిపాయివోలె రణమున నిలిచి
స్వేచ్ఛా భారతిని రక్షసేయరా!
'భరతుడు' పుట్టిన భారతమ్మురా!
భయము తోడ నీవు బ్రతక నేలరా?
పరాన్నభుక్కుల తుదముట్టించగ
'పటేలు' తీవితో పదము వేయరా!
దేశం కోసం ప్రాణాలొడ్డిన
ధీరుల ఉనికిని చాటి చెప్పరా!



# శిఖరాగ్ర దేశం

– **విశ్వనాథ్ మద్దిపట్ల**, హైదరాబాదు.

గుండుకు గుండె చూపి, ఆంగ్లేయుల గుండెలు నీరు గార్చి
సాధించుకున్న మన స్వాతంత్ర్యం
జరుపుకుంటోంది స్వర్ణోత్సవం
"యాభై ఏళ్ళలో ఏం ఒరిగింది?
అభివృద్ధి దేశంలో ఏం జరిగింది?"
సందేహాలు వెలుబుచ్చుతారు కొందరు
సంతాపాన్ని ప్రకటిస్తారు కొందరు
అభివృద్ధి లేదనే వారు అంధులు
అవగాహనా గుణరహితులు
'రేర్'గా 'రేడియో' కనిపించే దొకప్పుడు
ఇంటింటా 'కేబుల్' చానళ్ళ మోత ఇప్పుడు
ఊరి కొక్క 'ఫోను'ంటే గొప్ప అప్పుడు
మేడ మేడకీ 'ఫోను', వాడ వాడకీ 'ఎస్టీడీ బూతు' కనిపిస్తాయిప్పుడు
రైళ్ళు బాగా పెరుగుతున్నాయి
బస్సులు తెగ తిరుగుతున్నాయి
పారిశ్రామిక విస్తరణలు జరుగుతున్నాయి
అభివృద్ధి లేదనే వారు అంధులు
అవగాహనా గుణరహితులు
అలాగని దేశంలో సుఖం నిండిపోలేదు
సామాన్యుడికి సకల కష్టాలే!
పేదవాడి పెదవుల కాడికి చేయి
రోజుకొక్కసారి కూడ చేరడం లేదు
ఓట్ల కోసం అయిదేళ్ళకొకసారి
దేబిరించే రాజకీయ దేవుళ్ళు
ప్రజల పాట్లను గురించి
పట్టించుకోవడం మానేసి

స్కాముల స్కీముల్లో దూరి
నోట్లను లెక్కించుకొంటున్నారు
పెరిగే ధరలతో
తరిగే నైతిక విలువలతో
మరగే స్వార్థం, దురాశలతో
దేశం కరిగి పోతున్నది
సామాన్యుడి మనసు విరిగిపోతున్నది
ప్రతిభకు లోటు లేదు
వనరులకు చేటు రాదు
పరిస్థితులన్నీ మనం కల్పించుకున్నవే!
ఇంకా మించి పోలేదు
మంచితనం మనుషుల్లో పెంచుకుంటే
స్వంత లాభం మనసుల్లో తుంచుకుంటే
భవిత మన భారత దేశాన్ని
అగ్రదేశాలలో ఒకటిగా మలుస్తుంది
నిస్వార్థంగా కృషి చేస్తే అది
"శిఖరాగ్ర దేశం"గా నిలుస్తుంది



# దేశాన్ని కాపాడుకో

- పి. వేణుగోపాల్, హైదరాబాదు

కుల మత వర్గాల మధ్య రగిలే నిత్య నరబలిని
నేటికి, నాటికి రగిలి, రగిలిస్తూ రక్తాన్ని
ఇంధనంగా చేసుకొని ప్రాణాలను హరిస్తుంటే,
నా దేశ పరిస్థితి ఏమౌతుంది?
దినదిన నరమేధంతో
నాదేశంలోని జీవనదులన్నీ రక్తపుటేరులై ప్రవహిస్తుంటే,
నా సాటిసోదరులేతీవ్రవాదులై,
నాతోటి యువకులే ఉగ్రవాదులై
తమ తోటివారినే రాక్షస కృత్యాలతో బలి తీస్తుంటే
నా దేశ పరిస్థితి ఏమౌతుంది?
బుద్ధుని "అహింస" ప్రభోధం ఏది?
కాశ్మీర్ నుండికన్యాకుమారి వరకు
కనిపించే రక్తపు టేరులలో
నా దేశంకొట్టుకుపోతుందా?
రాజకీయరారాజులు కావడం కోసం
వారు విసరే ఎంగిలి మెతుకులకు ఆశపడి
అంధకారమనే అజ్ఞానంతో జనం అమ్ముడుపోతుంటే
నా దేశ రాజకీయపటంపై మతం
తీవిగా పీఠం ఎక్కుతుంటే
నా దేశ పరిస్థితి ఏమౌతుంది?
అంబేద్కర్ కలంతో. కలలుగన్నరాజ్యాంగం ఇదేనా?
ఓ భరత భూమి ముద్దుబిడ్డా!
భారతదేశ విద్యార్థి సంఘమా!!
భవిష్యత్తుబుగ్గిపాలు కాకమునుపే
నీ దేశాన్ని కాపాడుకో!
కదంత్రొక్కి నడుం బిగించి, అన్యాయాన్ని ఎదరించి
శాంతి జెండా ఎగురవెయ్యి
జై తెలుగుమాత! జైజై భారతమాత!



# వసుధైక కుటుంబం

- కె. మారుతి, హైదరాబాదు

స్వరాజ్యమే మనకు వచ్చిందయ్యా - కాని
బానిసత్వం విడిచి పోలేదయ్యా

ఆనాటి నేతలు స్వాతంత్ర్య సిద్ధికై
ప్రాణాలు పణముగా పెట్టారయ్యా
ఈనాటి నేతలు డబ్బు పదవులకై
బోఫోర్సు స్కాములకు మరిగారయ్యా
నవయువక! శక్తిని నిర్మిద్దాము
దేశాన్ని ప్రగతిపై నడిపిద్దాము
పల్లెల్లో, పట్నాల్లో నివసించు జనమంతా
కాలుష్య రోగాలకు గురియౌతున్నారయ్యా
క్షేమాన్ని కోరేటి చెట్లను మనమంతా
క్షామము రాకుండ నాటేద్దాము
దేశంలో సిరులు తులతూగెను
ఆకలిమంటలు విడిపోయెను
సారాయి మత్తును విడచి పెట్టుట కొరకు
ఆరోగ్య సూత్రాలు వినిపిద్దాము
"విద్యలేని వాడు వింత పశువు" అని
విజ్ఞాన మందించ ముందుందాము
అంధకారాన్ని తొలగిద్దాము
చైతన్య స్ఫూర్తిని నింపేద్దాము
అశ్లీల చిత్రాలు తెరపైకి రాకుండ
సౌశీల్య చిత్రాలు చూపిద్దాము
దేశదేశాల్లోన ఈ భరత సంస్కృతి
భవ్యంగ భవితకు అందిద్దాము
జగములో జననకీ జై అందాము

చేయిచేయి కలిపి జీవిద్దాము
గాంధీజీ నేతాజీ పిలుపు అందుకొని
పల్లెసీమలకే వెళదామయ్యా
గ్రామస్వరాజ్య నిర్మాణమ్ముకోసమై
'జన్మభూమి'కి నేడు పయనిద్దాము
కులమత భేదం మనకొద్దయ్యా
వసుధైక కుటుంబం మనదేనయ్యా



# జై భరతజాతి

- పి. చంద్రశేఖర్, కొత్తకోట, మహబూబ్ నగర్ జిల్లా

వెన్నుపోట్ల రాజకీయ చదరంగంలో
రాజ్యాంగం బలిపశువైపోయింది
అవినీతిసుడిగుండాలఅంచులపై
ప్రగతిపడవ సాగలేనంటుంది
దౌర్జన్యపు దారిద్ర్యపు ఇనుప సంకెళ్ళతో
భరత జాతి బందీ అయిపోయింది
తెల్లవాడిచ్చినస్వాతంత్ర్యం
తెల్లవారక ముందే "స్కాం"తంత్ర్యం అయిపోయింది
జాతి సంపద కొల్లగొట్టే తెల్లవాడిని వెళ్ళగొట్టి
నల్లవాడికి పట్టం గట్టి, పరిపాలన పగ్గమిస్తే
మాటరానిపశువుల నోటి గడ్డిసైతం గుంజుకొని మేస్తుంటే
దేశ ప్రగతి చక్రం దిగబడిపోయింది అవినీతి బురదగుంటలో
మతోన్మాదపు మర్రిచెట్టునీడలోఅటవికత్వం ఆనందతాండవం చేస్తుంటే
జాలువారిన రక్తం తిరిగి ఆ చెట్టునే పెంచి పోషిస్తుంటే,
ఎగరలేనంటుంది ఆ మువ్వన్నెల జెండా
నిలువజాలమంటున్నవి ఆ మూడు సింహాలు
వరకట్నపు మంటల్లోమగువకాలిపోతున్నా
మతశక్తుల కాళ్ళక్రింద మానవత్వం నలిగిపోతున్నా
ఎన్నాళ్ళీ మౌనం? ఇంకెన్నాళ్ళీ సహనం?
పాలుతాగే పసిపాప స్వేచ్ఛగ నవ్వాలన్నా
శిథిలమైన శాసనాల జాడలు తెలియాలన్నా
ప్రతియువకుడొకసూర్యుడై
ఆశయాల బాటలో అలుముకున్న చీకటిని ఛేదించి
భరతజాతి భవితవ్యాన్ని పునర్నిర్మించుకుందాం
చిరిగిన రాజ్యాంగానికి కొత్త అట్ట వేసుకుందాం
అసమర్థుల చేతికది అందకుండ దాచుకుందాం
జై భరత జాతి - జై జై భారతి ఖ్యాతి



# నాదేశం

- పి. రాజశేఖర్, హైదరాబాదు

ఇదే ఇదే నాదేశం – యాభైఏళ్ళ నాదేశం
అందమయిన నా దేశం – సుందర ఉద్యానవనం
కాశ్మీరపు సీమయందు రాబందుల ఆగడాలు
అమ్మ భరతభూమి తలకు సరిహద్దుల అలజడులు
దేశమాత సేవచేయు అదృష్టం కొందరిది
చేయి చేయి కలుపుకున్న నవభారత యువకులది
ఇంటికొక్క బిడ్డమారి అవుతాడొక శివాజీ
యుద్ధంలో శత్రువులకు కడతాడొక సమాధి
సాంఘిక అభివృద్ధి కొరకు అక్షరాలు వెదజల్లిరి
ఆర్థికాభివృద్ధి కొరకు శ్రామిక శక్తిని పెంచిరి
రైతన్నగ పొలందున్ని దండిగ ధాన్యం పెంచిరి
తల్లి భరతమాత యొక్క బిడ్డల కడుపులు నింపిరి
కులం, జాతి, మతంలేక ఉమ్మడిగా నీడనిడిన
భరతజాతి గొప్పతనం నలుదిక్కుల చాటించిరి
పరిశ్రమలు స్థాపించిరి – అభివృద్ధిని ఆశించిరి
అభ్యుదయపుమనుగడలో ప్రగతిపథం కాంక్షించిరి
చదువులె మన ధ్యేయమని సాధించిరి ర్యాంకర్లు
నిరంతరపు అభివృద్ధికి చేపట్టిరి కంప్యూటర్లు
రాజకీయ రాక్షసాన్ని ఒక చేతనె బంధించి
మనిషి మనిషి మనుగడకై విప్లవ శంఖమ్మూదిరి
బాపూజీ కన్న కలలు, చాచాజీ అన్న నుడులు
నిజం చేయ తలంచింది భరతజాతియువతరం
విద్యార్థుల నడవడిలో
చైతన్యపుఒరవడికై
ఆశించిన త్యాగధనం
రాబోయే యువతరం



# కృషే మన ఆయుధం

- ఏ. సుభద్ర, హైదరాబాదు

మనమంతా యువకులం
రాబోతుంది నవతరం
తుడిచేద్దాం అంతరం
మమ్మెదిరించుట ఎవరితరం?
మన ఇల్లు చక్కబెట్టుకుందాం
దేశ ప్రగతి సాధిద్దాం
కుళ్ళు రాజకీయాలను
కూకటితో కూలద్రోసి
పనికిరానిపట్టాలను
కట్టకట్టి మూలపెట్టి
కడుపుకింత తిండి పెట్టే
కొలువుకై శ్రమిద్దాం
మనను నమ్మిన జన్మభూమి
కలలన్నీ నిజం చేయ
తన కడుపున చిచ్చుబెట్టు
విద్రోహులను కూల్చివేసి
ప్రగతి పథానికి చక్కని
దారులెన్నో వేయాలి
మన దేశాన్ని సస్యవంతం చేయాలి
ప్రశాంత నిలయంగా మార్చాలి
స్వాతంత్ర్య సాధనకై స్వర్గానికేగిన
అమరజీవుల కలలు
కల్లలు కావని, కాబోవని
నిరూపించి చూపాలి
మనజన్మ సార్థకం కావాలి
నిర్విరామకృషే మన ఆయుధంగా
ఆశయసాధనకై సాగుదాం
రండి, రండి, రారండి!



# ఈ నేలకు మనమేమిచ్చాం?

- టి. కరుణాకర్, హైదరాబాద్

యాభైఏళ్ళ సువర్ణ స్వతంత్ర భారతం
గాంధి ఆశల పందిరి; నెహ్రూ నెలకొల్పిన స్వరాజ్యం
సస్యశ్యామలమైన సువిశాలమైన అన్నపూర్ణ
తొంబైకోట్లప్రజల కన్నతల్లి
ఎందరో మహానుభావులత్యాగఫలం
నేడు మనంఅనుభవిస్తున్న స్వతంత్రభారతం
యువకులారా! లెండి! ముందుకు పదండి!
కన్నతల్లి కన్న జన్మభూమి గొప్పది
ఆ తల్లిఋణంతీర్చుకొనుటకు యువకులారా! మేలుకోండి!
ఏ కోణం నుండిచూసినా ఏముంది గొప్ప?
దేశం నిండా కుంభకోణాలే!
ఏ ప్రభుత్వ కార్యాలయాన్ని చూసినా ఏముంది గొప్ప?
అంతా అవినీతి మయమే!
చిన్నా గొప్పా లేదన్నారు - కులం, మతం అసలే లేవన్నారు
ఏదది?బీదవాడు బానిసగానే బ్రతుకుతున్నాడు
గొప్పవాడు కోట్లు సంపాదిస్తూనే వున్నాడు!
రిజర్వేషన్ల గోడులో కొట్టుకుంటున్న కులమతాలను చూడు
ప్రజల సమానత్వం ఎంతగొప్పదో తెలుస్తుంది
విశృంఖలంగా వీరవిహారం చేస్తున్న శృంగారం పోకడలు
యువతను కదలనివ్వటంలేదు ముందుకు
చదువులు చదువుకొని ధనార్జనకై
పరాయిదేశాన్ని ఆశ్రయిస్తున్నారు యువకులు
ఇదా మన దేశ ప్రగతి?
నాటి మహానాయకులు కలలు కన్న భారతం?
రాజ్యమేలుతున్న కుటిల రాజకీయాల్ని
ప్రక్షాళనం చేయండి!

యువకులారా! మారండి!
దేశంమారాలంటే
ఏ వ్యక్తో -వ్యవస్థో మారితే కాదు
ముందు మనంమారాలి - మనంవ్యవస్థను మార్చాలి
అర్హత గలవాడికే అవకాశం
అప్పుడే దేశం ఇంకా ఇంకా సాధిస్తుంది ప్రగతి
ప్రపంచ దేశాలతో పోటి పడ్తుంది
జన్మనిచ్చిన ఈ నేలకు మనమేమిచ్చాం అని – అంతేగాని
దేశం మనకేమిచ్చిందనికాదు
అందుకే యువకులారా! లేవండి
పదండిముందుకు
శ్రీ శ్రీ గళం మన గళం



# స్వర్ణ స్వాతంత్ర్యమా!

- బి. శివప్రసాదరావు, హైదరాబాదు

చిందిన మృతవీరుల రక్తంతో
తెగిన భారత దాస్య శృంఖలాలకు
అప్పుడే యాభై ఏళ్లు నిండాయా!
ఉరితీయు బిడ్డ భగత్‌సింగ్ సాక్షిగా
మన్నెపు వీరుని విప్లవం సాక్షిగా
గాంధీజీ అహింస సాక్షిగా
నిజంగానే మనకు స్వాతంత్ర్యం వచ్చింది
కాని సమభావం, సమ సమాజం కలగానే మిగిలింది
పెట్టుబడి వర్గాల పతాకం
కార్మికుడనే కర్రను పాతి దానిపై ఎగురుతోంది
ఎటు చూసినా పీడితుల వెల్లువలే
ఆకలి బాధల పాటల పల్లవులే
మండే గుండెల, ఎండిన డొక్కల ఎగశ్వాసలే
ఎటు చూసినా కసాయి ఖద్దరుల కరాళనృత్యం,
కరడు కట్టిన ఖాకీల లాఠీల చప్పుళ్లు
విన్పించడం లేదా? తల్లీ, భరతమాతా! విన్పించడంలేదా?
ప్రకృతి ప్రళయాలుమరోవైపు
మహారాష్ట్రను మరుభూమిగా, కోనసీమను కాటిసీమగా మార్చేస్తుంటే;
ఇంకోవైపు ఎన్‌కౌంటర్ల విన్యాస క్రీడలు,
మందు పాతరల మారణహోమాలు
ఏమైపోతోంది దేశం? ఎటు పయనిస్తోందీ దేశం?
ఆధునిక భారతంలో, ఉద్యోగ పర్వంలో
నిరుద్యోగ పట్టభద్రుల నిరుత్సాహపు నిట్టూర్పులు
పండబారుతున్న వయసులో నిరంతరాన్వేషణలు
బ్రతుకుతెరువుకోసం వేశ్యలుగా మారిన వనితల గాథలెన్నో!
ఎన్నో!ఎన్నెన్నో! దారుణ కృత్యాలు నీలో దాచుకొని

రంగువెలసిన ఓ జాతీయ పతాకమా!
నీలోనికాషాయాన్ని ఎరుపుగా మార్చి
జనజీవన ప్రవంతిలోకి పంపిచైతన్య వంతులను చేయి
నీలోని పచ్చదనాన్ని బీడు భూములవైపు మళ్లించి
భరత భూమిని సస్యశ్యామలం చేయి
నీలోని కళంకంలేని తెల్లదనాన్ని మనుషుల
మనసులలోకి పంపి వారిని నిష్కళంకులను చేయి
లేకపోతే బాక్టీరియాను మించిన బడా నాయకులు
నిన్ను సైతం తమ జేబు రుమాలుగా మార్చగలరు
అయినా షష్టి పూర్తికి చేరువైన నీవు
ఉత్సాహంగా చేయలేవేమో!
ఏం చేసినా, ఉష్ణరక్త ప్రవాహ పూరితులైన యువకులే
నవ భారత నిర్మాణానికి నడుము కట్టాలి
మరో ప్రపంచాన్ని సాధించాలి



# జరాభారతం

- మేడిశెట్టి రవిచంద్ర, హైదరాబాదు

రెండు శతాబ్దాల గాఢ తిమిరం
అయిదు దశాబ్దాల ప్రమిదలతో
సైతం పోదు
ఏం సాధించామన్న ప్రశ్నేలేదు
అయినా
వేసిన ప్రతి అడుగును
కొలబద్దలతో కొలుస్తూ
ఎంత దూరమని సాగగలం?
ఒకదాని వెనుక ఒకటిగా
వచ్చే స్వాతంత్ర్య యుగాదులు
ఇసుమంతైనా మన బ్రతుకుల్లో
నింపలేవు స్వేచ్ఛోషస్సులు
మనమూ జండాలాంటివారమే!
అందుకే
ఎంతెగిరినా
అంగుళమైనా కదలం
కిందెక్కడో పాతేసిన జండా
స్వేచ్ఛగా ఎగురుతుందని
ఇన్నాళ్లు పండుగలు చేసుకున్నాం
మిఠాయీలు పంచుకున్నాం
కానీ
అంతలోనే
మన స్వాతంత్ర్యం ముసలిదై పోయింది
అందుకే మన స్వేచ్ఛ
కుక్కమూతి పెందెలు వేస్తున్నది



# రగులుతున్న భారతం

- **జి. రాజమౌళి**, లేదల్ల, వరంగల్ జిల్లా

తెల్లవాడి నుండి 'అధికారం'
నల్లవాడికి బదిలీ అయింది
ఇన్నాళ్ళ చరిత్రలో ఇతిహాసం ఏముంది?
ఇన్నేళ్ళ పాలనలో ఏదీ స్వర్ణయుగం?
ఎంత అవినీతి.... ఎన్ని అక్రమాలు, యెన్ని కుంభకోణాలు!
హత్యలెన్ని...దోపిడీలు ....మానభంగాలు - ఇదేనా అభివృద్ధి?
కుల మతాల కారుచిచ్చు రగులుతూనే ఉంది
మసీదులు - మందిరాలు కూలుతూనే ఉన్నాయ్
దళితులపై దమనకాండలు జరుగుతున్నా
పట్టపగలు నడిరోడ్డున బట్టలూడదీసినా
ప్రాంతీయతత్వం వెర్రితలలు వేసినా
సమానత్వమని చాటుట మూర్ఖత్వం!
ఎక్కడుంది నిజాయితీ - ఏవి ప్రేమా... దయా... జాలి...
అంతా పాశ్చాత్యం.... పాశవికం... క్రూరత్వం!
చట్టాలెన్ని తెచ్చినా పేదరికం పోలేదు
ఆక్టులెన్ని వచ్చినా వరకట్నం మాయలేదు
ఏవిబాపూ! ...నీవు చూపిన అడుగుజాడలు?
యేది బాబా అస్పృశ్యతలేని ప్రపంచం?
పోదా... ఈకుళ్ళు? మారదా ఈదేశం?
రాదా నవసమాజం? నవోత్తేజం?



# ప్రగతి పుష్పం

- సి.హెచ్.వెంకటలక్ష్మి, అనకాపల్లి

ఎందరో వీరుల త్యాగఫలం మన స్వాతంత్ర్యం
స్వేచ్ఛాజీవులైన భారతీయులు సాధించిన ప్రగతి ఎంతో గణనీయం
ప్రణాళికలతో ఛేదించినది పేదరికాన్ని, సాధించినది పారిశ్రామికీకరణను
కానీ నేడు భారతదేశం ఎదుర్కొంటున్న సమస్యలెన్నో!
జనాభా సంఖ్యలో ఆక్రమించినది ద్వితీయస్థానాన్ని
దానిని అరికట్టుటకై రూపొందించినది కుటుంబ నియంత్రణాన్ని
ఉద్యోగావకాశాలు లేక వీధిన పడిన యువతరం
కట్టెదుట కనిపిస్తున్న స్వయం ఉపాధి పథకాలెన్నో!
ఆకలి దప్పులతో అలమటించే అభాగ్య జీవుల కోసం
రూపొదించినది కనీసావసరాల పథకం
అక్షరాస్యత కోసం కృషిచేస్తున్న ప్రభుత్వం
'అందరికీ విద్య' కై ప్రతిపాదించినది వయోజనవిద్య
నేడు భారతదేశం వివిధరంగాలలో ఎదుర్కొంటున్న సమస్యలలో
ఆర్థికరంగంలో పరిష్కారంకాని సమస్యలు సృష్టిస్తే,
కులమత విద్వేషాలు సాంఘికరంగంలో తొలగని అసమానతలుగా పరిణమిస్తుంటే
కుంభకోణాలలో కుళ్ళిపోయిన రాజకీయాలలో దేశపరిస్థితే అగమ్య గోచరమౌతుంది
వీటి పరిష్కారానికై చేస్తున్న ప్రభుత్వ నిర్విరామకృషికి
గులాముగా సలాముచెయ్యని మేధావి లేడు
నేటి భారతదేశ భవిష్యత్తులో
కంప్యూటర్ యుగంగా మారిన ఈతరుణంలో
దేశ భవిష్యత్‌ను శోభాయమానంగా చేస్తుందనుటలో సందేహమే లేదు
ఆధునిక టెక్నాలజీతో రూపొందిస్తున్న పరిశ్రమలు
కావాలి ముందుతరాలకి ప్రగతి సోపానాలు
ఇటువంటి నవ్య భారతదేశ ఐక్యతా చిహ్నం
"భిన్నత్వంలో ఏకత్వం."
ప్రపంచానికే ఈ నినాదం కావాలిశాంతి కపోతం

యువతరం కదలి రావాలి వెల్లువలా
ప్రతిరంగంలో సాధించాలి ప్రగతిని నిండు వెన్నెలలా
స్వతంత్ర భారత స్వర్ణోత్సవాలకు స్వాగతం పలుకుతున్న భారతీయులు
స్నేహ హస్తాలతో కలసి మెలసి ఉండాలి
మన కలల సామ్రాజ్యం కాశ్మీర్‌ను
వికసించిన స్వర్ణోత్సవాల కోరికలు
వెదజల్లుతాయి ప్రగతి పుష్ప పరిమళాలు



# సందేశం

– జి.సువర్ణ, హైదరాబాదు.

యువతా! ఓ యువతా!
కనులు తెరిచి నిదురించిన ఓ యువతా మేలుకో!
లేడు నేడు వివేకానంద
వెన్ను తట్టి మిమ్ములేప
వెల్లి విరియాలి చైతన్యం మీలోనే
తల్లి భారతి సేవకై కట్టుకోవాలి కంకణం మీరు
విలక్షణమైన మీ జీవితానికి లక్ష్యమనేది ఒకటుండాలి
స్వార్ధ రాజకీయ కుంభకోణాలను ఎదురిస్తూ
సత్తా చూపించాల్సిన సమయం ఇది
అమ్ముకోకండి మీ అమూల్యమైన ఓట్లను
నడి బజారుల్లో కూరగాయల్లాగ
వృధా చేయకు మీ అమూల్య సమయాన్ని బాతాఖానితో
మానుకోవోయి కుల మతాల కుమ్ములాటను
తీర్చి దిద్దవోయ్ దేశాన్ని నిజమైన లౌకిక రాజ్యంగా
పాటుపడవోయ్ దేశ సమగ్రతను కాపాడడం కోసం
పొరుగింటి పుల్లకూర రుచి మరచి పోవోయి
పెంచుకోవోయ్ స్వదేశ సంస్కృతి పట్ల అభిమానాన్ని
పాలు తాగి తల్లి ఎదనే తన్నేసి అమ్ముడు పోతున్నారు విదేశాలకు
స్నేహమోహంలో కర్తవ్యాన్ని విడిచిపెట్టి
బానిసవుకాకు చెడు వ్యసనాలకు జీవితాంతం
బుద్ధుని అహింసను బుద్ధిగ చేపట్టవోయ్!
గాంధీకి వారసునివి కావాలోయ్! నిజాయితిలో
నిప్పులాంటి నిజాన్ని అద్దాల ముసుగులో కప్పి పుచ్చకోయ్!
నవభారత విధాతవై, శాంతి సౌఖ్య ప్రదాతవై
శబ్దార్థాది అలంకారాలతో సాగే సుందర కవనంలా
నిర్మించు నీ దేశాన్ని



# సమతా మార్గం

– సుధారాణి, అనకాపల్లి.

దేశమాత దాస్యశృంఖలాలు ఛేదించిరి ఆనాటి మహనీయులు
దేశ భవితవ్యాన్ని తాకట్టు పెట్టిరి ఈనాటి ధురంధరులు
కంప్యూటర్ కార్డులపై కార్మిక ప్రగతిని కొలిచారు
ప్రణాళికా ప్రగతిలో కర్షక మిత్రుని నలిపారు
ఇదీ నేటి ప్రగతి; కానీ యువతకు లేదు వసతి
బందులో, హర్తాళ్ళు, దహనాలు, దోపిడీలు
దగాకోరు ముఠాకోరు రాజకీయ కక్షలు
ఇదీ నేటి భారతం! ఇదా దేశ భవితవ్యం?
ఏదీ మన కర్తవ్యం?
అందుకే కదలాలి యువతరం
ఉరకలెత్తే పరుగులెత్తే నవతరం
యువత భవితకై, దేశ ప్రగతికై
నిర్మించిరి ఎన్నో పథకాలు
జనుల బాగుకై జన్మభూమి
ప్రజల పనికై పనికి ఆహారం
ఇలా ఎన్నో ఎన్నెన్నో వెలుగు బాటలు
నవతరం ప్రగతిపై కాంతి రేఖలు
సమసమాజ నిర్మాతలు నేటి యువతీ యువకులు
సామ్యవాదం రామరాజ్యం సాధించే వీరులు
అమరవీరుల త్యాగఫలం నిలిపేదే యువతరం
త్యాగధనుల తపః ఫలం రక్షించేదే నవతరం
మీరు కావాలి మరోతరానికి ఆదర్శం
దేశమాతకివ్వాలి నూతనోత్సాహం
ఇదే, సమతా, మమతా సాధనకు మార్గం



# ప్రగతి మెట్టు

– **టి.వేంకటేశ్వర రావు**, హైదరాబాదు.

ఓ అర్ధ శతక స్వాతంత్ర్య భారతావనీ!
నీవు శతకోటి బిడ్డలను కన్న అమ్మవి
నీకు వందనం!
భారతమాతా! నీ భవిత అంతా యువత చేతుల్లో
వివేకానందుని విప్లవ వాక్కుల్లో
నీ విముక్తి పోరులో ....
భగత్ సింగ్, సుఖ్‌దేవ్, రాజ్‌గురుని
ఉరికొయ్యలు కబళించలేదా?
అల్లూరి ఉడుకు నెత్తురు ఏరులై పారలేదా ?
నీ కరాల శృంఖలాలు తటాలున తెంచలేదా ?
ఆ స్ఫూర్తీ, ఆ శక్తీ మా నరాల్లో ప్రవహిస్తుంది
మమ్మ ముందుకి నడిపిస్తుంది
త్రివర్ణ పతాకాన్ని ఎగరేస్తుంది
కాని ..... నేడు
చేయూత లేక యువత చెల్లాచెదురవుతుంది
నిరుద్యోగంతో, నిరాశతో నిర్వీర్యం అవుతుంది
అనుక్షణం పెరుగుతున్న జనాభాతో తాళలేక
వనాలన్నీ జనాలతో నిండి ఎండిపోతున్నవా?
ఓ యువతా! మన  తక్షణ కర్తవ్యం
ఒక్కరితోనే పంచుకొనే తల్లి, తండ్రి బాంధవ్యం
ఇదే దేశభక్త నిర్వచనం, జాతిశక్తి నిర్మాణం
వెలిగించు ప్రతి ఇంట్లో అక్షరజ్యోతి
తుడి చేయి నిరక్షరాస్యత అపఖ్యాతి
జనాల సొమ్మును నిలువున దోచే
భ్రష్ట నాయకుల, దుష్ట వర్తకుల
బజారుకీడ్చి మసిగా మాడ్చే

పీడితతాడితుల కండగనిల్చే
న్యాయవాదివై, చైతన్య గీతమై
కష్టిస్తేగాని కడుపు నిండని
కడుపేదకు కర్మగాలి రోగమొస్తే
నగదులడగక నయం చేసే వైద్యునివై,
దీనజనులకు ఆరాధ్యునివై,
ప్రతి వృత్తిని పవిత్రంగా
పరిగణించి, పరిశ్రమించి,
ప్రతి యువకుడొక సైనికుడై
ప్రగతికి మెట్టు కావాలి



# విజయీభవ

– కె.వి.నారాయణదీపక్, హైదరాబాదు.

యువకులే దేశ ప్రగతికి ప్రతీకలు
వేయాలి వారే భవితకు పునాదులు
వారే భావిభారత నిర్మాతలు
దేశానికి వారే వెన్నుపూసలు
సహనం, శాంతం పునాదిరాళ్ళు
నెహ్రూ,గాంధీ ఆదర్శాలు
భగత్, బోసుల ధీరత్వాలు
ఇవే నీ విజయానికి కావాలి తొలిమెట్లు
నాడు లేదు విజ్ఞానం, కాని అంతా హరితం
నేడు వుంది విజ్ఞానం, కాని అంతా క్షామం
నాడు ధర్మం నాలుగు పాదములు
నేడు అధర్మం నలభై విధములు
దుష్ట రాజకీయానికి అడ్డుకట్ట లేకనే
దేశ పరిస్థితి అధోగతి పాలాయేనే!
కులమతాల రక్కసికి అడ్డుకట్ట లేదురా!
కట్టగల సామర్థ్యం నీదేరా సోదరా!
దళం దళం కట్టు దళం
గళం గళం విప్పు గళం
కావాలి మీరు సూర్యగోళం!
మీకు మీరే అంగబలం!
మీకు మీరే అర్ధబలం!
మనదేరా శౌర్యకులం
కదలిరండి! కదలిరండి!
కణకణాగ్ని శిఖల నుండి
విముక్తిని ప్రసాదించండి!
భరతమాతకు వ్యధల నుండి

భాష, ప్రాంత భేదాలు మనలోన వద్దురా!
మనమంతా ఒక్కటే అని ఎలుగెత్తి చాటరా!
కన్న తల్లి భారతిని రక్షిద్దాం సోదరా!
రక్షించే ఆయుధం మనమెరిగిన విద్యేరా!
భరతమాత కీర్తిని దశదిశలా చాటుదాం
అభివృద్ధి విత్తులను నలుదిశలా నాటుదాం
కలసిమెలసి పని చేస్తే వచ్చునయ్యా ఫలితం
ఈ కార్యసిద్ధి మన విద్యార్థికే సాధ్యం
విద్యార్థుల జీవితం
దేశానికే అంకితం
స్వాతంత్ర్య సంగ్రామం
అను గత చరిత్రే దర్పణం
"అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ"
అన్న వేద భూమి మనదయ్యా
దాని వారసుడవు నీవయ్యా
"మాతృ దేవోభవ, పితృదేవో భవ
ఆచార్య దేవోభవ" అనే విద్యార్థి నీకు
విజయీభవ! దిగ్విజయీభవ!



# ఓ నేస్తం! అందించు నీ హస్తం!!

- బి. పద్మజ, విశాఖపట్నం

"భరతఖండంబు చక్కని పాడియావు"
అని అన్నారు చిలకమర్తివారు
అందుచేతనేనేమో
భారత దేశానికిస్కాములనే
చీమలుపట్టి పీడించుచుండగా
కమీషన్లనే గమీషన్లు చల్లుచూ
చేతులు దులుపుకుంటోంది సర్కారు
కానీ, మన స్కాముల చీమలు వాటిని
పంచదారలా చప్పరించి గడ్డిలా నమిలేసి
యూరియాలా ఊసేస్తున్నాయి
ఇవి ఇలా తినేస్తూ ఉంటే
మన భూమి అవ్వదాఅంగారక గ్రహం?
స్కాముల బొజ్జలు పెరుగుతూ ఉంటే
మన దేశానికివదలదు శనిగ్రహం
కాబట్టి నేస్తం!
కల్లబొల్లి కబుర్లేల వింటావు?
వీళ్ళు తినగా మిగిలిన సోమాలియానే కంటావు
ఓ అణుబాంబు పేల్చేస్తే, ఓ ఉపగ్రహం పంపిస్తే
ఓ కంప్యూటర్‌ని సృష్టిస్తే, జరిగిపోదు అభివృద్ధి
మండే ఎండిన కడుపులకు పిడికెడు మెతుకులు చూపడమే ప్రగతి
మనదేశపు పిల్లలాడే ఆట - ఉప్పుల కుప్పలు
మనదేశం పాడేపాట - అప్పుల కుప్పలు
ఇదీ నేస్తం!
నేటి నవ నాగరిక భారతదేశ పరిస్థితి
ఇది ఇలాగే కొనసాగితే పట్టునేమో దుఃస్థితి
సహించలేక మన యువతరం

తిరుగుబాటు చేసేనో
"నక్సలైటువో", "టెర్రరిస్టువో" అని
అనుమానించ గలదు ప్రభుత
నీ యువశక్తిని, ఉడుకు రక్తాన్ని
దారిలో పెట్టి చూపించు నీ ఘనత
నాయకుడివి కా! నీతిగా పాలించు
అవినీతిని నమ్మేవాళ్ల నోళ్ళు మూయించు
డాక్టరువైనా, యాక్టరువైనా
కలెక్టరువైనా, కండక్టరువైనా
కావలసింది మనదేశ సౌభాగ్యం
కోరాల్సింది ప్రజల సంక్షేమం
జేబు సంతృప్తిని కొంత మానుకుని
జాబు సంతృప్తికి నువ్వు కట్టుబడితే
క్రుంగిపోయిన భరతమాతకు చేవనిచ్చే యువతవు
నువ్వే అవుతావు నేస్తం! గుర్తుంచుకో!



# చైతన్య సారథీ!

- **కమలేకర్ శ్యామ్‌ప్రసాద్‌రావు** రంగాపూర్, మహబూబ్ నగర్ జిల్లా

పల్లవి: ఈ దేశపు భవితవ్యం
మీ పైనే! ఓ యువతా
కదలిరండి జాగృతులై
జన జీవన దీపికలై

1. చరణం: వివేకవంతుడివై ప్రగతిదారి సాగరా!
దేశమాత సేవకై నడుంకట్టి నడవరా!
పాశ్చాత్యపు మోజులో మన సంస్కృతి మరువకు
ఈజాతే విశ్వానికి విజ్ఞానం పెంచెరా! ॥ఈ దేశపు॥

2 చరణం: శ్రమశక్తిపై యువతకు విశ్వాసం పెరగాలి
జాతి ఐక్యతకై యువత సంఘటితం కావాలి
ప్రగతి పథంలో దేశం ముందడుగు వేయాలి
యువశక్తే ఈజాతికి కొత్తకాంతి తేవాలి ॥ఈ దేశపు॥

3 చరణం: అవినీతి, అరాచకం సహియించకు ఓ యువత!
దేశద్రోహ. ఉగ్రవాద చర్యలనే అణచివేయి
సమతా, మమతల మనవాతాసాధనకై
చైతన్యపు సారథివై సాగవోయి ఓ యువకా! ॥ఈదేశపు॥



# నాకవితలో....

- ఎల్.నిశాకర్‌రెడ్డి, కొంగరకలాన్, రంగారెడ్డిజిల్లా

ఎవరిగూర్చి వ్రాయను?
వాగ్దానాలను గాలికి వదలి కుంభకోణాలతో కోట్లుపోగేసే
లంచగొండి నాయకుల గూర్చి వ్రాయనా?
వలువలనువదిలేసి, విలువలను మంట గలుపుతున్న
రంకు సినిమాల గూర్చి వ్రాయనా?
ఎవరిగూర్చి వ్రాయను....?
ఎన్నో ఆశలతో, అహోరాత్రులు చదివి,
నిరుద్యోగ సమస్యతో నీరుగారి పోతున్న
నవ యువతీయువకుల గూర్చి వ్రాయనా?
సుఖమయ జీవితం గడపాల్సిందిపోయి వరకట్నపు రాకాసికి
బలయిపోతున్న అమాయక వనితల గూర్చి వ్రాయనా?
మతం, మతం అని సతమతమవుతున్న
కులం కులం అని కలహాలు సాగిస్తున్న
వెర్రి మానవుల గూర్చి వ్రాయనా?
సగటు మానవుని నడ్డి విరుస్తూ, నింగిలోని తారలకే
సవాలు విసురుతున్న నేటి ధరల గూర్చి వ్రాయనా?
కుటుంబ నియంత్రణ గూర్చి ప్రచారం సాగిస్తున్నా
తామరతంపరగా పెరిగిపోతున్న నేటి జనాభా గూర్చి వ్రాయనా?
బీదరికం అనే విషవలయంలో చిక్కుకొని
ఆకలితో 'అలోలక్ష్మణా' అని అలమటిస్తున్న
నిరుపేద కుటుంబాల గూర్చి వ్రాయనా?
ఎవరిగూర్చి వ్రాయను? ....ఏమని వ్రాయను...?
భారతమాత స్వర్ణోత్సవములు జరుపుకుంటూ,
ఒక కంట 'ఆనందభాష్పాలు' రాలుస్తున్నందుకు సంతోషపడాలా?
ఇన్ని సమస్యలతో సతమతమౌతూ,
మరోకంట 'విలాపపుష్పాలు' రాల్చ జేస్తున్నందుకు విచారపడాలా?



# సేవా భావము

- **నాగపురి శ్రీనివాసులు,** భువనగిరి, నల్లగొండ జిల్లా

భారత భావిపౌరులగు భాగ్య విధాతలు పోరుబాటలో
పోరుచు పెక్కు త్యాగములుబొందుచు నుండిరదేమి చిత్రమో!
దారుణమైన రీతి యువత స్థితి వక్రపు దోవ బోవుచో
పారము జెందుటెట్లు? నవభారత నిర్మితి మాట యెట్లొకో?

త్రాగుడు జూదంబులకును,
బాగుగ మత్తులకు మిగుల బానిసలైనన్
వేగమె యువశక్తియు నెటు
పోగలదో చూడకున్న పొందదు ప్రగతిన్

దేశవృద్ధి యంత తేరిపారగజూడ
యువతశక్తి పైనె యున్నదనుచు
వారి సేవలన్ని వ్యర్థమై పోవగా
ప్రగతిబాట నెట్లు జగతి నడచు?

డాక్టర్లు, యాక్టర్లు, ఫ్యాక్టరీ అధిపతుల్
విత్తమున్నయట్టి వేత్తలైన;
చదువెంతొ చదివియు సంస్కారహీనులై
డబ్బు సంపాదించు డాబుగలిగి;
దేశభక్తియు వీడి దేవులాటలజిక్కి
స్వార్థచింతనచేత జన్మభూమి;
జనని యనెడి మాట మననకే రాకుండ
పాశ్చాత్య దేశాన భ్రమలు గొనియు;

పరుగు పరుగున ఆవాస ప్రాంతమందు
శక్తియుక్తులచే సేవ జరుపుచుండి,
తనదు సౌఖ్యంబు కోసమై తానెయున్న
భారతమాతకు నెవ్విధి ప్రగతిగలుగు?

యువత నవీన మార్గమున యోచన జేసి, పురోభివృద్ధికై
నవతరమైన పద్ధతుల నర్తిలజేయగ వర్గ, వర్ణముల్
భవితను పోరొనర్చకయె, బాగుగ గూర్చుచు సామరస్యమున్
నవయుగ భావజాలముల నవ్యసమాజము నిల్పగావలెన్

కులము, మతము పేర కుమ్ములాటలు మాని
కలసి యున్న చోట కలిమి గలిగి
"మనుషులంత నొకటె, మనమతం బొక్కటే"
అనుచు బోధ కరిపి మనుపవలయు

యువత నడుముగట్టి, ఉత్సాహవంతులై,
దేశ సుగతి కొఱకు దీక్ష బూని,
సర్వకార్యములను స్వచ్ఛందసేవకై
పరుగులిడిన యెడల ప్రగతి గలుగు



# 'మా' వేపచెట్టు

- హారిక (మాదిరాజు హరినందనరావు) హైదరాబాదు

మా పొలంలో ఉన్న వేపచెట్టు
ఉరేసుకుందువుగాని రా అని పిలుస్తుంది
పిలవకేం జేస్తుంది?
కదలలేని స్థితిలోకి నెట్టిన నా బ్రతుకుకు
అంతకన్నా కావలసిన ఆప్యాయతేముంది?
మిత్తీలకు అప్పులు తెచ్చి, బోరుబావితోడుకుంటే
"పవర్‌కట్" పేరుతో నా "నజర్" కట్ చేశారు
మిగిలిన గంటకు 'ఓల్టేజీ' లేకపాయె
నాటిన వరినారంతా నాపచేను పంటాయె
ఆడనో, ఈడనో, కొద్దిగంత మిగిలితే
వడగండ్ల వానొచ్చి ఆయింత నాకిపాయె
విత్తనాల గింజలన్నీ "విత్తనాలు" అయిపాయె
చేసిన కష్టం అంతా మట్టిలోన కలిసిపోయె
అప్పిచ్చిన షావుకారి గుడ్లు ఉరిమి సూస్తుంటే
కడుపులోని ఆకలేమో కండ్లెర్ర జేస్తుండె
దిక్కులేని నా బతుకుకు పెంచిన చెట్టేదిక్కు
పెంచిన చేతులకు ఋణం తీర్చుకుంటానంటూ
రారమ్మని పిలిచింది
తన కొమ్మకు ఉరేసుకొమ్మంది



# చైతన్య సాగరం

- కట్టమూరి భారతి, హైదరాబాదు

బ్రహ్మ జెముడు మొక్కకు రక్కసి ముళ్ళు పోయి
సన్నజాజి తీగలా సువాసనల పూలు పూస్తోందేమిటి?
కింగ్ కోబ్రా పగ పట్టడం మానేసి పకపక నవ్వుతుందేం?
బీహార్ పశు గ్రాస కుంభకోణాల్లో
ఆరితేరిన నాయకుల అంతులేని రాజకీయ చైతన్యాన్ని
కళ్ళారా చూసి అవి అలా చలించాయి
పద్దెనిమిదేళ్ళ ఓటు హక్కు
రాజకీయ నాయకుల పదవికిచ్చే కిక్కు
యాభై ఏళ్ళ స్వాతంత్ర్యం
అసెంబ్లీ గుద్దులాటలకు అందమైన దర్పణం
అవినీతి లంచాల సమాజం
ఇన్నాళ్ళ స్వాతంత్ర్యపు సన్నజాజికి పూసిన క్రొత్త పుష్పం
అంగార గ్రహం అదురుతుంది
మంచుకొండలు కరిగి కన్నీరు కారుస్తున్నాయ్
పేదరికపు ఆత్మహత్యలు చూసి, అన్నార్తుల ఆక్రందనలు విని
రంగుల మేడలు వెలిశాయి – సంపద వానలు కురిశాయి
పేద గుడిసెకు ఎన్నెన్ని తూట్లు!
ఆ స్వాతంత్ర్య సమరానికి అన్ని పాట్లు!
యాభై వసంతాలు సృష్టించిన సౌందర్యం,
అందమైన పూలతోటలు ఇచ్చే స్వేచ్ఛాకుసుమం
స్వార్థ విష వృక్షానికి అవినీతి చేదు పళ్ళు
లంచాల నీరు పోశారుగా – అందుకని!
యువత చైతన్య సాగరం
అన్ని సమస్యలకు అందమైన పరిష్కారం
నలుగురు చేతులు కలపాలి! అవినీతి లంచాలకు అంతం పలకాలి!



# చరిత్ర పునరావృతం

- తంగిరాల చక్రవర్తి, హైదరాబాదు

అరిస్టాటిల్ అన్నాడు చక్రంలోని
ఆకుల్లా చరిత్ర పునరావృతం అని
అదే! అదే! అవుతోంది ధరిత్రి చరిత్రలో
అది భారదేశం కావచ్చు. బ్రిటన్, బల్గేరియాలవ్వొచ్చు...
స్వర్ణోత్సవ భారతికి, అప్పుల హారం
స్వీకరింప జేసిన, స్కామ్ వీరుల స్వా(హా)తంత్ర్యం
స్వశాంతి, విశ్వశాంతి, అంటూ సాగే మౌన వ్రతం
'స్వేచ్ఛా' జీవులకు, కారాదు మరో మహాప్రస్థానం
స్వదేశీ అప్పులు, విదేశీనొప్పులు
స్కామ్ స్వాముల గొప్పలు
సామాన్యుని బ్రతుకు తిప్పలు
స్వర్ణోత్సవ భారతికి నిత్యం ప(క)న్నీళ్ళు!
స్వేచ్ఛా మార్కెట్ శృంగార నైషధం
స్వదేశ సంస్కృతి - నిత్య నైవేద్యం
శాంతి, సిరి, సంపదల, చోరుల నిత్య చౌర్య చోద్యం
శ్రామికుని రక్తం పీల్చే జలగల నిత్య భోజ్యం
పశువుల మేతను మేసిన నేతలు
ప్రజలను మేయరని అనలేము!
నాడు మాదేశం వదలి పొండి అని గర్జించాం
నేడు మాదేశం రండి, రండి, అని అర్థిస్తున్నాం
ఎడారి బ్రతుకుల బాటసారులూ!
అవినీతి అంతంకై మనం పట్టాలి పంతాలు
పనికిరాని కాసులే చరిత్రకు చుక్కానులు
పోరాటాలే జనశక్తికి విజయ సాక్షులు



# తల్లి భారతి సేవకు తరలిరండు!

- భైరవభట్ల కామేశ్వరరావు, విజయనగరం

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టి మాటలె, మిగిలెనోయి!
ఎట్టిమేల్ కనిపించదోయి!
జుట్టు జుట్టూ పట్టుకుని
దేశస్థులంతా కొట్టుకొనిరోయి!
రాజకీయం రంగుమారి
రాక్షసత్వం పెరిగెనోయి!
దేశాభిమానం మాకు వద్దని
విదేశాలకు తరలినారోయి!
దేశభక్తికి నీళ్ళు వదలి
భుక్తికే విలువిచ్చిరోయి!
మతద్వేషం మంటల్లో పడి
శాంతిపుష్పము కాలెనోయి!
వైరమన్నదిలేచి పెరిగి
లోకమును పీడించెనోయి!
దేశమనియెడి దొడ్డవృక్షం
మోడుగా మిగిలింది కనవోయి!
బాధకేడ్చె తల్లి భారతి
కంటినీరూ రక్తమేనోయి!"
ఏ సీమకేగినా, ఎందుకాలిడినా
ఎచ్చోట జూచినా, ఎక్కడడుగిడినా
రగిలెరా! ఈ భూమి ద్వేషాల చితిని
సలిపెరా! అవినీతి విలయతాండవము!
పశుగ్రాసమును మేయు మంత్రులొక వంక
మతకలహములు రేపు నేతలొకవంక

భక్తులను వంచించు స్వాములొకవంక
ఏ వంక జూచినా మంచి కనరాదు!
ఏ ప్రభుత వచ్చినా సుస్థిరత లేదు!
ఉద్యోగ వేటలో నూరకే తిరుగుచు
కాలంబు వట్టిగా గడప వద్దు
పాశ్చాత్య సంస్కృతి పాశంబునకు జిక్కి
మనదేశ సంస్కృతుల్ మరువవద్దు
నాయకుల్ వల్లించు మాయమాటలు నమ్మి
స్నేహ పుష్పంబును చిదమవద్దు
కులమత భేదాల జ్వాలలందున ద్రోసి
శాంతి పావురమును చంపవద్దు
మంచి మాటయు, మరియాద మరువవద్దు
హద్దు మీరిన ఆవేశమసలు వద్దు
పట్టుదల, దీక్షలెప్పుడు వదల వద్దు
మనుషులందరు ఒక్కటై మనుటె ముద్దు!
అర్ధ శతవత్సరోత్సాహమతిశయిల్ల
భారతావని జరిపెడు పర్వవేళ
పసిడి భవితను పండించు భావయుక్తి
తల్లి భారతి సేవకు తరలిరండు!



# దేశ స్వరూపం

- చోడిశెట్టి రామగోపాల్, రాజమండ్రి

తరాలు మారుతున్నాయి – అంతరాలు పెరుగుతున్నాయి
కాలమెంత గడచినా, బ్రతుకెంత మలచినా
బీడు భూములు మారలేదు – మోడు బ్రతుకుల సేద తీరలేదు
శాంతి యన్నది తెలియలేదు
దేనికోసం శాంతికి ఈ తిరస్కారం?
ఏమిటి దీనికి పరిష్కారం?
నవభావుక యువకుల్లారా! నవభారతి నిర్మాతల్లారా!
తెల్సుకొండి దేశ భవితవ్యం – తెలియరండి మన కర్తవ్యం
జన జీవన స్రవంతిలో మన భావనల భవంతికి
సఖ్యత అనే రాళ్ళ పునాదివేద్దాం!
అసమానతను సమాధి చేద్దాం!
నట్టనడుమ కట్టెదుట జరిగే కారుణ్యహీన కరాళ నృత్యాలకు
అరణ్యరోదనల అమానుష కృత్యాలకు
శ్రుతి కలిపే కంచుఢక్కల డొక్క చీల్చి
శాంతి తత్వం సంతరించి,
తల్లడిల్లే తల్లిమనసుకు తపన తీర్చే పనులు చేద్దాం!
వినువీధిలో త్రివర్ణకేతనం ఎగురవేద్దాం!
మింటినంటే దేశ భక్తిని మంటగలిపే దుష్టచేష్టలు
సాగవంటూ, పటిష్టమయిన దేశ విశిష్టతను కాపాడుదాం!
అప్పుడే, సస్యశ్యామల దేశం,
నవ్వుల పువ్వుల మన దేశం
సిరులొలుకుతూ మనకోసం అందించును నవసందేశం



# పదవుల పందేరం

- యం. నరసింహ, హైదరాబాదు

కొండ గుహల్లో నక్కినక్కి దాగియుండి
ఆకాశ హర్మ్యాల గొడుగు కింద గాలిలో తేలిపోయి
రాసే కవిత్వపు కళ ఎండమావి కోసం
గుఱ్ఱపు పరుగులు తీసేది ప్రజాశక్తి కాదు
మీ ఊహా స్వప్నం – అభూత ప్రపంచం
జనం సెంట్రల్ జైలులో ఖైదీవై
కష్ట నిష్ఠురమైనా వెనుక బడ్డ మన
బతుకు సాగరంలో చేపవై ఈదుతూ
పుట్టినందుకు జీవన నావను నడపక తప్పదనీ
మనస్సులోని మంచిని నిర్బంధంగానైనా ఆచరిస్తే అభ్యుదయం
గ్లోబిల్ను ఇంటర్ నెట్‌లో ఇరికించిన ఘనత మనదైనా
వ్యత్యాసం వెట్టి పోకడలను లాగ దీసేది మనమే!
భగవత్సన్నిధానంలో నివసిస్తూ భక్తులకు జ్ఞాననేత్రం చూపించే
స్వాముల వారు, స్కాంలలో స్వారి చేసి జేబులు నింపుకోవడం
ప్రజా ప్రగతికి విస్ఫోటకం
భూమండల కిరీట భారం నెత్తిన పెట్టుకోవడం
కిరీటంపైన పతంగిలా ఎగరాలనుకోవడం,
తహతహలాడుతూ - తడబడపడుతూ
కత్తుల ఒరలోంచి - తుపాకుల సొరంగాల లోంచి
చట్టాల సందులలోంచి తన్నుకోవడమంటే రాజకీయ భూకంపమే!
పదవుల పందేరంలో చిక్కుకొని హత్తుకొని
జెండాల పత్రాలకు జాలీలు పెట్టి జారుకొని
వేరు కుంపట్లు తలమీద పెట్టుకుని మురిసి పోతే
ఓటర్లు జ్ఞాన జ్యోతులై సందుచూసి బాణాలు సంధించి
భరతభూమిని ఒళ్ళో దాచుకుంటారు



# నాతరం చూస్తున్న 'భారత్'

- జె.వి. శర్మ, హైదరాబాదు.

ఏవి సుభాసుబోసు నినదించిన వీర విశేష శౌర్యముల్?
ఏవి 'వివేకు'డీ యువత కిచ్చిన దివ్య సుగంధ మాలికల్?
భావన లెల్ల వక్రమయి భారతి దాస్యము నొందుచుండగా
యేవిధి నూరకుందువు కవీ! నినదింపుము ఘోరగర్జతో

మైకు బట్టుక బూతు మైకాన వల్లించు
నీతి విదూరులు నేతలైరి
ప్రభుతత్వ మెరుగని ప్రతిభా విహీనులు
రాజుగా పీఠిపై రాజిలంగ
తోచినంతగ సొమ్ము దాచుకు మింగెడు
దానవోత్తములెల్ల దైవములుగ
కక్ష, కార్పణ్యాలు లక్షణమ్ముగ గల్గి
శిక్ష తప్పించుకో శిష్టులుండ

ఎటుల నోర్చుచు నుంటివో ఎరుగలేను
శ్రాంత హృదయమ్ముతో నీవు సాత్వికముగ
ఇంకనైనను మేల్కొల్పు మిప్పుడైన
అమ్మ! మాయమ్మ! భరతాంబ! ఆంధ్రసుతుల

గజినీ చేసిన ఘోరముల్ మరతువో? కన్పింపవా వంచనల్?
నిజముల్ చచ్చి సమాధియాయె; ఖలులన్ నిర్జించ యోధుండవై,
గజరాజుంబలె కదలిరా యువకుడా! గాండ్రించు శార్దూలమై
ప్రజలన్ ఏకత గూర్చగా ప్రతినతో పర్వంపు ఈ వేళలో

ఆజాదు కోసమై అగ్నులు గుప్పించు
నేతాజి బోసుతానేల లేడు
సంస్థానముల నెల్ల సంలీన మొనరించు
ఉక్కు మనిషి పటేల్ ఉర్విలేడు

మన్నె వీరుల గుండె మండించి మేల్కొల్పు
    అల్లూరి ధారలీ అవని లేవు
'పొరుగు దేశపు కుక్క! పొండిరా పొండ'ంచు
    పోరు సల్పిన భగతు పుడమిలేడు

వారి భావాలు ఈనాడు మారుచుండె
కొత్త నేతల రాతలు గొప్పగాగ
ప్రగతి పథమున పయనించు భావిలోన
కంటకమ్ములు తొలగునో? కాలమెరుగు!
అందుకే
కఠిన పాషాణ హృదయాల కరగజేసి
కస్రమ కాశ్మీర కుంకుమ గంధమలది
తల్లి భరతాంబ సేవించి, ధన్యతగని
జాతి నేకత గూర్పగా జాగదేల?



# స్వాతంత్ర్యం - స్వ'తంత్రం'

- కొడవలి రాజగోపాల నాయుడు, హైదరాబాదు.

ద్విశతాబ్ది
దాస్య కుటీరంలో
దిక్కు తోచక కూర్చున్న
దివ్య మూర్తికి లభించిన
స్వాతంత్ర్య సత్ఫలం
స్వర్ణోత్సవాల నాటికి....
స్వాతంత్ర్య రాజీవం
అవుతుంది నేడు నిర్జీవం
జవం నిండిన యువతరంలో
రాదా ఇక జీవం!
స్వాతంత్ర్య సుమాల మాల
అన్యాయపు ముళ్లకంపలో
రాజీ పడలేక
కకావికలై రెక్కలుడుగుతుంది
రాజకీయపు
రంగుటద్దం
నిత్యం
మార్చే రంగులకు
కళావిహీన మౌతుంది
తనవారిని
తనే నాశనం చేస్తూ
చంకలు బాదుకునే
చవటలున్నందుకు
నా స్వాతంత్ర్యపు తల్లి
వందలో సగానికి
వృద్ధురాలయింది

మత వివాదాలతో
మానభంగాలతో
మర్డర్లతో
బస్సుల్లో బాంబు పేలుళ్లతో
వంతెనలు విరిగి
రైళ్ళు కూలడాలతో
మనవారి చేతుల్లోనే
మహాత్ముల హత్యలతో
విజృంభించే
హత్యాకేళికి
మనస్సులో
చెలరేగిన
బడ బాగ్నులకు
బ్రద్దలై పోయింది
నా శాంతి దేశం
రాజకీయ
రాబందువు
ఊసరవెల్లిలా
రంగులు దాలుస్తూ
దొరికిన ప్రతిదీ
దోచేస్తున్నది
దానికి లేదా అడ్డు?
హవాలా ధీరులు,
కుంభకోణాల జగజట్టీలు,
స్కాం రత్నాలు
ఉన్నందు వల్లే
నాటి స్వాతంత్ర్యం
నేటి స్వ'తంత్రం' అయింది
స్వర్ణోత్సవాల నాటికి ...!



# ఆలోచించు బ్రదరూ!

- అనుముల రవీందర్, హైదరాబాదు

ఆలోచించు! 'ఓటు బ్రదరూ!' ఆలోచించు!
మొన్నటి దాకా ఎస్టీలు, ఎస్సీలు...!
నేడు బీసీలూ ...! అవుతున్నారు నేటి బుర్జువా
రాజకీయ నేతలకు ఓటు బ్యాంకులుగా!!
దాన్నర్థం చేసుకోవాలిమీరు -
ఎంతో లోతుగా ... మరింతబాగుగా!
లేదంటే -
నలిగి పోతారు దుష్ట రాజకీయ 'చెద' రంగంలో...
పావులుగా ... భ్రష్టులుగా!!
సన్నాసీ, సన్నాసీ రాసుకుంటే...
రాలుతుంది బూడిద అన్నట్లుగా,
నాయకుడు, మరో ప్రతి నాయకుడు...
కలుసుకుంటే కూలిపోయేది ఓ ప్రభుత్వమో! ఓ పార్టీయో!
అదే కదా! నేటి రాజకీయాల్లో కన్పించే
నగ్న దృశ్యం! మలిన చిత్రం!!



# ప్రగతి వెన్నెల

- కె.వి.వి.ఆర్. సోమేశ్వరశర్మ, హైదరాబాదు

నరనరాల పరుగెత్తే యువశక్తి
నవ భారత నిర్మాణానికి ఊపిరి
అవినీతికి ఉరి
యాభై స్వాతంత్ర్య వసంతాల సిరి
యువకుల కర్తవ్యం లంచాల అంతం!
నెగ్గాలి పేదరికం నిర్మూలన పంతం!
తరతమ తేడాలచే తగ్గింది యువకులకు శాంతం
కోపాగ్ని నేత్రాలకు కావాలి బ్లాక్ మార్కెట్ దహనం!
మత్తు మందుకు కట్టాలి సమాధి
యువత ప్రగతికి అదే పరమావధి!
కులమతాల నిర్మూలనం, దారుణ వరకట్నాల వినాశనం
యువకుల మనసుల మరోనందనవనం
మహిళల ప్రగతి
పురోగతికి మారాకు
రాజకీయాల దగా కోరుతనం మీద
యువకులు సంధించాలి పాశుపతాస్త్రం
నాకెందుకన్న అలసత్వం
యువకుల నిస్తేజానికి కారణం
రికమెండేషన్‌ల రాజ్యం
పైరవీల దళారుల మంత్రాంగం
లంచగొండి ఉద్యోగుల యంత్రాంగం
యువకుల సామూహిక ప్రతిఘటనతో అంతం
కల్తీకి కాలం చెల్లాలి
మోసానికి థార్ ఎడారి చూపాలి!
పురుషాధిక్యత ఫారిన్ వెళ్ళిపోవాలి!
యువత న్యాయ గవాక్షాలు తెరవాలి!

కాసుల కోసం నిర్మాతల తపన ధనసర్పంకాటు
అశ్లీలత, అసభ్యత సిగ్గుచేటు
అంగాంగ శృంగారం స్త్రీలపై గొడ్డలి వేటు
యువతుల విప్లవం మరో సూర్యోదయం
త్యాగం, మానవత్వం, సామాజిక స్పృహ
నీ గుండెలనిండా తొంగి చూడాలి!
ప్రగతి వెన్నెల పూరి గుడెసల నిండాలి!
పేదోడు పెద్దోడు తేడాలు తొలగిపోవాలి!



# స్వేచ్ఛా భారతి

- యం. భీష్మాచారి, హైదరాబాదు

ఏబది సంవత్సరముల స్వేచ్ఛా భారతి
సాధించిన దేమి ఉన్నతి?
సెంటిమెంటుకు మనదేశం పుట్టినిల్లాయె
సొమ్ము చేసుకొనుటకే మననేతలాయె
సేయింట్ కిట్స్ ఫోర్జరీలు
టెలికాం సుఖ్‌రాంలు
బోఫోర్సు రాజులు
హవాలాలీలలు ఎన్నని చెప్పను?
స్కాముల స్వాములు
యువత నాకర్షింప కల్కి భగవానులు
నేతల దీవింప బాబాల అవతారములు
షేర్లతో ముంచు హర్షద్ మెహతాలు
ఎన్ని విధముల మునిగినా మేల్కొనని ప్రజలతో
మేలుకొన్నా మరుదినము మరచు ప్రబుద్ధులతో
నా స్వతంత్ర భారతి
సాధించిన ఉన్నతిని ఏమని పొగడను?
నేటికీ దేశమంతా, దోషివని వేలెత్తి చూపిన
మంకు పట్టులో నక్షత్రకుడు నాకు గురువని గద్దెదిగక
ప్రాంతీయ పార్టీలను పుట్టగొడుగుల్లా పెడుతూ
గడ్డి వాముల్లో తగలబడి పునీతులౌతూ
ఎరువుల మ్రింగి సర్వరోగ సమ్రాట్టైన
డబ్బురోగంతో ఉబ్బి పోతున్నారు
స్వేచ్ఛా భారతావనిలో ప్రధాని పదవిని సైతం
వంతులేసుకోవచ్చని నిరూపించిన ప్రజలతో
నా స్వతంత్ర భారతావని
సాధించిన ఏమి ఉన్నతి!
ఆహా ఏమి ఉన్నతి!



# దేశ ప్రగతి

- బి.హెచ్.పి. సాయిరాజు, ఏలూరు

భారతీయ సోదరా!
మనదేశ ప్రగతి అద్వితీయమురా!
దేశకీర్తి పొగడగ
ప్రజల నోళ్లు చాలవురా!
తెల్లోళ్ళను తరిమి కొట్టి
శక్తి యుక్తులు కూడగట్టి
"జన్మభూమి"ని నమ్ముకొని
జాగృతమైన దమ్మమనది!
లౌకిక రాజ్య స్థితితో
సనాతన వ్యవస్థతో
అధునాతన శక్తి కలసి
కదులుతున్న జాతి మనది!
ప్రవాహాల కడ్డుకట్టి
జోడెద్దుల సాగునుండి
యంత్రం దాకా సాగిన
విప్లవాత్మక వైనమిది!
పరమాణువు పగులకొట్టి
రోదసినే అందుకొనుచు
ఆదర్శ దిశగా సాగుతున్న
సాంకేతిక దేశమిది!
ఉద్దండులు ధీశక్తుల
యుద్ధంలో జయమంది
నిత్య వృద్ధి నొందుతున్న
జాతికెన్ని వెతలో కదా...!
వృక్షాలే కూలిపోవ
కాలుష్యం కమ్ముకొనగ

దేశం కంపించి పోవ
ఆరోగ్యము కుంటువడియె
సరిలేని ప్రణాళికలు
నిరుద్యోగికి పెక్కుపాట్లు
మేధావుల వలసలతో
"దేశహాని" జరుగుతోంది
మా"నవత"కు విలువలేక
వ్యామోహ స్వామ్య మాయె
"నవ" లోకం ఈ రీతిగ
ఊరుకోదు! ఊరుకోదు!
అవినీతికి త్వరలోనే
ఆయువు ఇక తీరుతుంది
నిరాశలను, నిట్టూర్పుల,
యువతరమే తరమాలిక



# దేశ ప్రగతి - యువకుల కర్తవ్యం

- రాచకొండ రాజయ్య, భువన గిరి

"దేశమును ప్రేమించు మన్నా! మంచియన్నది పెంచుమన్నా!"
అన్నాడు ఆనాడు గురజాడ
దేశం గురించే పట్టించుకోక, దేశాన్ని ఎలాగో దోచుకొని
తన సుఖాన్నే కాంక్షిస్తున్నారీ నాడు
దేశం మాకేమిచ్చిందని ఉస్సురు మంటారు
ఈ దేశానికి మేము ఏమిచ్చామని కాస్తైనా యోచించరు
చదివీ, చదివీ, అలసి పోయామని
తిరిగీ, తిరిగీ, వేసారినామని
ఉద్యోగాలిక అలభ్యమని నిరుత్సాహంతో
దేశంపైన, ప్రభుత్వం పైన తిరుగుబాటు చేయాలనీ
విప్లవమే ప్రగతికి శరణ్యమని కొందరు విప్లవ బాట నడుస్తూ
తూటాలు చేతబట్టి దేశ విద్రోహక శక్తులుగా మారి
దేశ విధ్వంసక చర్యలకు పాటు పడుతూ
విదేశాలతో చేతులు కలిపి
దేశ సమైక్యతనే నాశనము చేయపూను కుంటున్నారు
మాదక ద్రవ్యాలకూ, మత్తు మందులకూ బానిసలై
ఎంగిలి బీడీలకూ ఎగబడుతూ
మంగళ కరమగు జీవితాన్ని నింగళాలతో కాల్చుకుంటున్నారు
అమూల్యమైన కాలాన్ని వృధా పుచ్చుతూ
కాలం గడిస్తే చాలని ఆలోచించే యువత
దేశభవితవ్యం కోసం ఒక్కసారి ఆలోచించాలి!
స్వార్థపు బుద్ధితో తన కోసం కాకుండా
ఈ దేశంలో పుట్టి పెరిగి, ఈ తల్లి ఋణం తీర్చుకొనుటకు
పవిత్ర భారత భూమిపై ప్రేమ మమకారాలను పెంచుకోవాలి
చదవని వాడు సరేసరి

చదివిన వాడిక్కూడా ఉద్యోగాల్లేవు - అంటూ
ఇంజనీయర్లు, డాక్టర్లంతా పాశ్చాత్య దేశాలకు ఎగబడితే
పేద భూమి భరత భూమి ఏమి కావాలి?
అందుకే .... యువశక్తి మేల్కొని,
వారి శక్తి నంతా ఈ దేశానికే అంకితం చేస్తే
భారత దేశం ప్రగతి పథంలో పురోగమించుట ఖాయం



# ఓ యువతా! మేలుకో!

- డి. ఎస్. పుష్పవేణి, విశాఖపట్టణం

సన్నని జరీచీర అగ్గిపెట్టిలో బెట్టి
రాణివారికిచ్చిన ఖ్యాతి మనది
కానీ కట్టుబట్టల్లేని పరిచారికలున్నా
పట్టించుకోని దేశ ప్రగతి మనది
కంప్యూటర్ల తయారీని బహుగొప్పగా చెప్పుకునేవారు
పకల బలపం లేని బడి పిల్లల గురించి ఆలోచించరు
ఏమంటే సోమాలియాలోని పిల్లల్ని చూపుతారు
రాకెట్ ప్రయోగాల్లో మోగే రొదరొద ధ్వనులు
దోమల నివాసాల్లో మెసిలే ప్రజల యెదల ధ్వనులు
ఒక్కటే నేస్తం – కానీ ఒక్కటే తేడా
అదే మంటే అవి ఆకాశంలో – ఇవి నేలపై నిదురించే గుండెల్లో
అప్పులకుప్పలు ఆడుకుని అలసిపోయింది మనదేశం
ఒప్పులకుప్పలు ఆడుకునే తీరిక లేకపోయింది పాపం!
స్కాములదోమలు కాటువేయగా డి.డి.టి కమీషన్లు వాపోతున్నాయి
కోట్లుఖర్చుపెట్టేది ప్రభుత్వం, నిండేదినాయకుల కోట్లు;
జనుల కష్టాలు, బహుకోట్లు, వినలేక
విసిగిపోతున్నాయి మన దేశపు కోర్టులు
నక్సలైట్ల బుర్రల్లో లైట్లు ఉన్నాయనీ
మిలిటెంట్ల ముంగిట్లో టెంటులున్నాయనీ
టైగర్ల మెడకి టైలు చుట్టుకున్నాయనీ
దారి మళ్ళించే నాయకుల దగాలింకెన్నాళ్ళు?
గాంధీజి కలలు కల్లలు – నెహ్రూగారి ఆశ నిరాశ
సగటు జీవుడి బతుక్కు పెడుతుందిచిల్లి
ఆర్నెల్ల కోసారి వచ్చే గవర్నమెంటు జీతాలనిల్లు
ఎక్కడ ఉందయ్యా ప్రజాస్వామ్యం? తెలియదు గమ్యం
ఉరకలు వేసే ఉడుకురక్తం కారాదు వ్యర్థం

ఆలోచించి చేస్తేనే యుక్తం – అప్పుడే నశిస్తుంది స్వార్థం
నాయకత్వం వహించేవాడు నాయకుడు –
బూజు పట్టిన కుర్చీలకు కావల్సింది యువకుడు
నీతి నిజాయితీలను నిద్రలేపు బ్రదర్!
ఇంతకాలం పోయిన నిద్ర చాలు! మేలుకొలుపు పాడు!
అవినీతిని అన్యాయాల్ని శాశ్వతంగా తొలగించాలి
కొత్తగా వచ్చిన మార్పులను జనులు గమనించాలి
దేశ సౌభాగ్యం ప్రతియువకుని కర్తవ్యం!
విజయశాంతినే అడగాలంటే మళ్ళీ మొదటికొస్తుంది వ్యవహారం,
కాబట్టి బ్రదర్!
నాయకుడు నరనరాన పాకే నవ భారత నిర్మాణ సాధకుడు



# నా కలం గళం విప్పింది

- ఆరుద్ర సుదర్శన్, ఆత్మకూరు, మహబూబ్‌నగర్

మానవత్వాన్ని మరచిపోయి మనషులన్నది ఎరుకలేక
తలలు తెగ నరుక్కునేందుకు తహతహలాడే తమ్ముళ్లకోసం
దానవత్వాన్ని దౌర్జన్యంగా మార్చి 'దాదాగిరి' చేస్తున్న
దగాకోర్లు నా అన్నల కనువిప్పు కోసం,
మాదక ద్రవ్యాల మత్తులో మునిగి తేలుతూ
మతి చలించి తిరుగుతున్న యువతలో నవత కోసం
తరతరాలుగా అంతరాలను పెంచుతున్న
కుళ్ళు కులమత విభేదాల మార్పుకోసం
స్వార్థ రాజకీయంతో "స్కాం" ల సంగ్రామంలో
దేశపురోగతిని అధోగతి పాల్జేస్తున్న నయవంచకుల
తెగ తెంచడం కోసం
చీకటి బ్రతుకులను వెలిగించడం కోసం
యువతరంలోని నరనరాల్లో దేశభక్తిని నింపి
ఆశయసాధనకై భరతమాతకు భగత్‌సింగ్‌లను
అగ్గిపిడుగు అల్లూరులను ఇవ్వాలని
నా తల్లి భారతికి హారతిగా అక్షరాలను అలరిస్తూ,
పదాలతో పలకరిస్తూ, నిజాన్ని నిలదీస్తూ
అవినీతి గుండెల్లో గునపాలు గుచ్చేందుకు
నా కలం గళం విప్పింది



# విజయాన్ని సాధించు

- ఏ. దామోదర్, ఆత్మకూరు, మహబూబ్‌నగర్‌జిల్లా

నవతర యువతర శక్తీ! మేలుకో! మేలుకో!
చైతన్యంతో నీ దేశం ఏలుకో!
తల్లి అయిన దేశం కొరకు తనయుడువై తరలిరా!
నీ అణువణువూ దేశ సేవకు వదలరా!
పదవంటే - హవాలా, కుంభకోణ స్కాములనో
బ్రతుకు కొరకు పదవులని ఏనాడు అనుకోక
పగలనక రేయనక క్షణక్షణం శ్రమించు
రాజకీయ రాక్షసత్వం కబళించు
కామాంధుల కళ్ళు తెరిపించు
గాంధీజీ కలలు గన్న స్వాతంత్ర్యంకై స్పందించు
అర్థరాత్రి ఆడదాన్ని నడిరోడ్డున నడిపించు
దేశప్రగతి సాధనలో లేరురా నీకు ఎదురు,
గర్జించు - గాండ్రించు ఇంకెందుకు నీకు బెదురు
అమరజీవి, అల్లూరి అడుగుల్లో పయనించు
దేశ ప్రగతియే నీ ధ్యేయంగా, ప్రతి అడుగును కదిలించు
భారతంలో కృష్ణుడవై సారథ్యం వహించు
పట్టు వదలని విక్రమార్కుడివి నీవై పోరాడు
నలుదిక్కుల ప్రగతి పాట గొంతెత్తి పాడు
ప్రతి యువకుడు నేతాజీలా, శివాజీలా దేశంకై పోరాడి
అంబెడ్కర్‌ను, ఆంధ్రకేసరిని ఆదర్శం చేసుకుని
అంటరాని తనాన్ని, నిరక్షరాస్యతను, పేదరికాన్ని రూపుమాపు
మారణహోమాలను, మాణభంగాలను హతమార్చు
లంచగొండితనం మత్తుమందు బారినుండి దేశాన్ని రక్షించు
ఈ చరిత్ర పుటల్లో, దేశ ప్రజల గుండెల్లో, నీ పేరును లిఖించు
దానాల్లో నీ హస్తం కర్ణుడు, రంతిదేవుళ్లను మించాలి
ధర్మాల్లో నీ నామం ధర్మరాజుని దాటాలి

ధైర్య సాహసాల్లో నీ అడుగు కట్ట బ్రహ్మన పై అడుగు కావాలి
ప్రతి యువకుడు ఓ సైనికుడై నడుం కట్టి కదలాలి
వేసే ప్రతి అడుగు దేశానికి ఓ కొత్త మలుపు అవ్వాలి
ఆ రవియే అస్తమించి, చుక్కలు, చంద్రుడు నిదురోయినా
నీ లక్ష్యం వదలకు – బెబ్బుల్ని చేదించు – మెరుపుల్ని చిందించు
కర్తవ్యంతో కాలాన్నే శాసించు – మరో చరిత్రను సృష్టించు
ఉదయించే సూర్యుడివై ఉద్యమాన్ని శాసించు
కురుక్షేత్ర సంగ్రామంలోని అభిమన్యుడిలా లంఘించు
కవిగాంచని, రవిగాంచని చోట నీవు గాలించు
వీరుడవై ధీరుడవై విజయాన్ని సాధించు



# వేయవోయి పూలబాట

- టి. పాండురంగం, హైదరాబాదు

యువకుడా! నవయువకుడా!
వేయవోయి పూలబాట
నిలపవోయి గాంధిమాట
నడువవోయి ముందుకు
ఎగురవేయి ప్రగతి జెండ
రగిలించు చైతన్య జ్వాల
ఈ స్వర్ణోత్సవవేళ
వెలిగించవోయి
విజ్ఞానపు చిరుదివ్వెను
అజ్ఞానపు అంధకారంలో
ఎలుగెత్తి చాటవోయి
భరతదేశం భాగ్యమైనదని
ఆనందపు లహరిలో
పాడవోయి విజయగీతం
మధుమాసపు కోయిలవై



# ప్రగతికి హారతి

- వై. ప్రేమ్ కుమార్, హైదరాబాద్

కుంభకోణపు దుండగుల
పూలబంతుల వలె చెండాడవే ఓ భారతి!
తునుమాడవే మా భారతి!
దేశ ప్రగతిని పిల్లిలాగా
కళ్ళు మూసి మేసే రాక్షసుల
పీక నొక్కి వేయవే ఓ భారతి!
ముందుకు సాగవే మా భారతి!
బరితెగించిన బడా చోరు
మేక వన్నె పులుల మూతులు
బిగియబట్టి తరిమి కొట్టవే ఓ భారతి!
ఉరిమి చూడవే మా భారతి!
నీ తనయుల గుండెకాయల
గండికొట్ట నీయకమ్మా!
జాతి వేసిన ప్రగతి మెట్లు
పెకల నీయకమ్మా!
మహాశక్తిగా నవతరానికి
శక్తి ప్రసాదించవే ఓ భారతి!
ప్రజలకు దారి చూపవే మా భారతి!

